# గోరాశాస్త్రీయం

## విశ్లేషణాత్మక వ్యాఖ్యానాలు

గోరాశాస్త్రి



రిజిస్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# GORASASTREEYAM

***Selections from Gora Sastri's Works***



ప్రచురణ : 54

ప్రథమ ముద్రణ ; ప్రతులు : 2, 200

2 జనవరి, 1977

ముఖచిత్ర రచన, అక్షరాలంకరణ

శీలా వీర్రాజు

ముద్రణ :

నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్సు, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

టెక్నో ప్రింటర్సు, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500 003

వెల : రు. 2-00

Paper used for printing of this book was made available by the Government of India at concessional rates.

YUVABHARATHI IS GRATEFUL

గంగిశెట్టి లక్ష్మీనారాయణ 3



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటే ఇతరమైన సాత్వికసాధనంలేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమసాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది యువభారతి 54 వ ప్రచురణ. ఇంతవరకు రెండులక్షల ఏభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 4,600 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వతజీవిత సభ్యత్వ పథకాలలో ఆరువందల మందికి పైగా భారతీమిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలో నైనా సభ్యులుగాచేరి మా 'నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. 'నందిని'లో యువభారతి కార్యకలాపాల వివరాలేకాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

2-1-1977.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# మా మాట

ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో పత్రికా రచన ఒక అనిర్వచనీయమైన ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది. వికాసోన్ముఖంగా పరిక్రమిస్తున్న సమాజం అభిరుచులకూ, ఆవేశాలకూ, ఆకాంక్షలకూ, అభ్యుదయోద్యమాలకూ, సజీవ వ్యాఖ్యానంగా దైనందిన జీవితంలో భాగస్వామిగా స్థానం సంపాదించుకున్నది. నేటి సమాజంలో ప్రజాభిప్రాయానికి రూపకల్పన చేయడంలో పాత్రికేయుడు నేతృత్వం వహిస్తున్నాడు.

శ్రీ గోరాశాస్త్రి గారు అగ్రేసరులైన పాత్రికేయులు. 'ఆంధ్రభూమి' సంపాదకులు. పత్రికా రచయితలుగా ఉన్నత ప్రమాణాలను అందుకున్న శ్రీఖాసా సుబ్బారావుగారి సాహచర్యంతో అపారానుభవాన్ని గడించుకున్నవారు. ఆంధ్రాంగ్లభాషలలో సమర్థతతో లేఖినిని నడుపగల రచయితలు. తెలుగుభాషలో ఆయనకున్న అభినివేశం, తెలుగు నుడికారం మీద ఆయనకున్న అధికారం, జాతీయ, అంతర్జాతీయ సమస్యల తలస్పర్శి అవగాహనం ఆయనను ఒక ఉత్తమ పాత్రికేయునిగా మలచినవి. సంపాదకీయాలను తెలుగునుడికారానికీ, వ్యంగ్య మర్యాదలకు లక్ష్యప్రాయంగా రచిస్తున్న సాహితీమూర్తులు. కథకులు, నాటకకర్తలు, వ్యాసకర్తలు, విషయం రాజకీయం కానీ, సాంఘికం గానీ, ఆర్థికం కానీ, వ్యంగ్యమర్యాదలకు లోపంలేని విధంగా, విజ్ఞానప్రదంగా వ్యాఖ్యానించడం ఆయన ప్రత్యేకత.

'తెలుగు స్వతంత్ర' లో 'వినాయకునివీణ' శీర్షిక క్రింద వెలువడిన వాటిని కొన్నింటినీ, 'ఆంధ్రభూమి' సంపాదకీయాలలో కొన్నింటినీ, ఏర్చి ఈ 'గోరా శాస్త్రీయాన్ని' ప్రచురిస్తున్నాము. ప్రచురించుకునే అవకాశాన్ని మాకు ప్రసాదించిన శ్రీ శాస్త్రిగారి ఔదార్యానికీ, సాహిత్యాభిమానానికీ మా ధన్యవాదాలు. 'యువభారతి' పన్నెండేండ్ల క్రితం శ్రీ శాస్త్రిగారి ఆశీరమృతాన్నీ, ప్రోత్సాహాన్నీ పొంది, దినదినాభివృద్ధిని సాధించ గలిగిందని హర్షోత్ఫుల్లహృదయాలతో శ్రీశాస్త్రి గారికి అభినందనాలను సమర్పించుకుంటున్నాము.

'తెలుగు స్వతంత్ర' సంపుటాలను మాకందించి ఈ పుస్తక ప్రచురణను సుసాధ్యం చేసిన సహృదయులు, భాషాభిమానులు, ఉత్తమ రచయితలు శ్రీ కోదాటి లక్ష్మీనరసింహారావు గారి సాహిత్య ప్రణయానికి మా కృతజ్ఞతా ప్రపూర్ణములైన నమస్సులను సమర్పించుకుంటున్నాము.

2-1-977.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.

# 1

# మనిషిని మనిషిగా చూచే మనీషి

తెలుగులో కవిగా చెలామణి కావటం తేలిక; విమర్శకుడుగా గుర్తింపబడటం విశేషం; రచయితగా రాణించటం కష్టం. రచన అంటే చేతికి వచ్చిందల్లా రాసేయటం కాదు. కవితనూ, విమర్శనూ కళాత్మకంగా రంగరించటం. ఇది మిశ్రమకళే కావచ్చు. మిశ్రమం చేసే మేధయే అందులోని మెరుపు. అయితే కాఫీ కలపటంకూడా కళే కదా? అంటారేమో! కళే. ఆ కళ ఆ కాఫీ యిచ్చే రుచిలో ఉంటుంది. ఆ రుచి దాని వ్యక్తిత్వం. అంటే కలిపేవాడి వ్యక్తిత్వం. రచనలో వ్యక్తిగా నిలిచేవాడు రచయిత. సమన్వయంలో స్వతంత్రత రచయిత, ఆలోచనలో ఆత్మీయత రచయిత; నిప్పులో నిజాయితీ రచయిత; సమకాలీనతలో సమ్యక్‌దృష్టి రచయిత; విలోకనంలో వివేచన రచయిత.

ఒకసారి ఆచంట జానకిరాంగారు ఆంధ్రభూమి కార్యాలయానికి వెళ్ళి గోరాశాస్త్రిగారితో 'ఇప్పుడేం చేస్తున్నారు?' అని ప్రశ్నించారట! 'ఇప్పుడా! ఇప్పుడే పెన్సిలును చెక్కుతున్నాను. అన్నారట శాస్త్రిగారు. రోజూ పెన్సిలు చెక్కేవాడు పత్రికా రచయిత, ఏరోజు కారోజు పెన్సిలు ముక్కు వాడిగా ఉండాలి. పెన్సిలుతో రాసేరాతలు సిరాతో రాసే రాతల్లాగా శిలాక్షరాలు కాకపోవచ్చు. ఆనాటికి వెలుగిచ్చే సూర్యోదయం లాంటివి. పెన్సిల్ ముక్కు వాడి చేయటం ప్రతీకాత్మక ప్రయోగం. ప్రతి రోజూ ప్రపంచాన్ని వదునుగా పరీక్షించాలి వాడిగా సమీక్షించాలి. వాడిదనంలో రాసేవాడి వేడిదనం కనపడాలి. గోరాశాస్త్రిగారు రచనలో ఉండే వాడిదనాన్ని వ్యంగ్యంగా చెప్పారామాటల్లో.

రచనలు సామాన్యంగా మూడు బాటల్లో నడుస్తాయి. నలిగిన బాటల్లో నడిచేవి కొన్ని, సొంతబాటల్లో నడిచేవి కొన్ని, స్వతంత్రపుబాటల్లో నడిచేవి కొన్ని. నలిగిన బాటలో రాసేరచయితలు ప్రతితరంలోనూ పిరివిగా కనపడతారు. కాలంతోపాటు నడిచి కాలగర్భంలో కలిసిపోతారు. సొంతబాటల్లో నడిచే రచయితలు ఏ సిద్ధాంతానికో కట్టుబడి ఉంటారు. తాము తగిలించుకున్న రంగద్దాల్లోంచి లోకాన్ని చూస్తూ తమరంగు కనుగుణంగా రచనను చిత్రిస్తారు. ఇక

స్వతంత్రపుబాటల్లో నడిచే రచయితలు కట్టుబాట్లు లేని కాలాతీతవ్యక్తులు. వీరి రచనల్లో విలువలకు వెల ఎక్కువగా ఉంటుంది. న్యాయవేత్తల్లాగా అసిధారా వ్రతంతో సత్యాన్ని అన్వేషిస్తుంటారు. వీరికి ప్రమాణం మనిషి. మనిషికి కలిగే మేలే విలువకు ప్రమాణం.

సమాజంలో సమస్యలుంటాయి, సంఘర్షణలుంటాయి, నీతి ఉంటుంది, అవినీతి ఉంటుంది. తెలుపునలుపుల వింతచిత్రం సమాజం. ప్రతిరోజూ ఒకమూల ఒక కేక వినిపిస్తుంది; ఒకచెంప ఒకమెరుపు మెరుస్తుంది. ఒకసారి భూమి కంపిస్తుంది; ఒకతూరి వరద ముంచేస్తుంది. అన్నింటికీ వెనుక ఏవో శక్తులు పనిచేస్తుంటాయి. స్వతంత్ర రచయిత వీటికి స్పందించవచ్చు; సానుభూతిని ప్రకటించవచ్చు; సత్యంకోసం ప్రతిఘటించవచ్చు; సమన్వయాన్ని సూచించ వచ్చు. కాని, అతడేశక్తికీ దాసుడు కాలేడు. స్వీయదృష్టితో సమీక్షిస్తాడు; స్వయంశక్తితో రచన సాగిస్తాడు. నడుస్తున్న చరిత్రలో మానవత్వపు విలువలను మధించి వెలికితీస్తాడు. వర్తమాన చరిత్ర అతనిదృష్టిలో క్రొత్తగా వచ్చిన వాన నీరు. దానిలో పంక ముండవచ్చు పరిమళముండవచ్చు. కాని, అతనికావలి సింది అందులో ఉన్న నీటి నిజస్వరూపం. గచ్ఛత్ప్రవాహంలాంటి మానవ చరిత్రలో అతడు వెదికేది జీవితపు విలువలు. అవి చితికిపోతుంటే చిటపట లాడతాడు: మండిపోతుంటే గుండెలు బాదుకుంటాడు. చిగురిస్తుంటే చిరునవ్వు నవ్వుతాడు. విలువల్ని బోధించి మహర్షిలా సూక్తులు చెప్పడు; విలువల్ని శోధించి మనిషిలా మాటలు చెపుతాడు, తెలుగుదేశంలో ఇటువంటి రచయితల్లో గోరాశాస్త్రిగారు అగ్రశ్రేణిలో నిలుస్తారు.

దినపత్రిక జీవితం ఒకరోజు కావచ్చు; ఒకగంట కావచ్చు. పరిగెత్తే ప్రపంచంలో ఒకరోజుచరిత్ర కావచ్చు. పఠితకూడా పరుగుపరుగునా తిప్పేస్తాడు పుటల్ని. వార్తలూ, విశేషాలూ, ప్రకటనలూ, పతాకాలూ, దినఫలాలూ, చలనచిత్రాలూ, వింతలూ, విడ్డూరాలూ, కార్టూనులూ, కార్యక్రమాలూ అన్నీ క్షణంలో కరిగిపోయేవే. వీటన్నిటికీ విలువకట్టే సంపాదకీయం ఒక 'కాలంలో' ఉన్నా కొంతకాలం నిలిచేది. పరిస్థితులకు పతాకగా నిలిచే ఆ రచన పఠిత కొక నవ్యాలోకాన్ని అందిస్తుంది. ఆలోచనను రేకెత్తిస్తుంది. అలా చెయ్యకపోతే అది

అనవసరం. పత్రికానావకు సంపాదకీయం చుక్కాణి. అది పైనజెప్పిన మూడు తోవల్లో ఎట్లైనా గతిని మార్చవచ్చు. పతితను మనిషివైపు మళ్ళించే స్వతంత్ర రచన అయితే మానవతకు ధ్యేయమైన మార్గాన్ని చూపుతుంది.

మనిషి విలువను కొలవటానికి ప్రమాణ మేమిటి? స్వతంత్రతకు మించిన సాధనం లేదు. అది రాజకీయ స్వాతంత్ర్యం వల్ల వచ్చేది కాదు: సిద్ధాంతాల ఆరాధనం వల్ల వచ్చేది కాదు; సాహిత్యాన్ని ఆపోశనం పట్టటంవల్ల వచ్చేది కాదు; వీటి నన్నింటిని స్వప్రయోజనాలకు వాడుకొనే మనిషి స్వార్థాన్ని నిస్వార్థంతో నిగ్గు తేల్చటం వల్ల వచ్చేది. నిగ్గు తేల్చటానికి నిజాయితీ కావాలి. నిజాయితీకి సమస్యల పమీక్షలో నిండు మనస్సుతో ఉన్న ఒక నిర్లిప్తభావం ఉండాలి. సమాజంలో ఎంతా సక్తుడై ఉన్నా అసక్తుడై ఆలోచించే అవధానం ఉండాలి. ఆ అవధానంతో చేసే అభివ్యక్తి స్వతంత్ర వ్యక్తిత్వాన్ని రూపొందిస్తుంది. గోరాశాస్త్రి గారిని 'స్వతంత్రు'డైన రచయిత అని దాశరథిగా రన్నారు.

'స్వతంత్ర'లో వినాయకుడి వీణ మ్రోగించారు గోరాశాస్త్రిగారు. లోకంలో ఉన్న వైణికుల కందరికీ తంత్రులు మీటటానికి రెండే చేతులు. వినాయకుడికి మూడు చేతులు. మూడో చేయి మ్రోగించే మోహనరాగం లోకాన్ని ముగ్ధుల్ని చేసింది. లోకధర్మం ఒక హస్తం, రచనాధర్మం రెండో హస్తం, స్వతంత్ర వ్యక్తిత్వం మూడో హస్తం. సప్తస్వరాల్లో ఈ మూడు చేతులు మీటిన రవళులు వినిపిస్తాయి. అందువల్లనే ఆ శీర్షికలో వెలువడిన సమీక్షలు లోకావలోకనాలు, సాహిత్యగౌరవాలు, గోరాశాస్త్రీయాలు,

పత్రికా రచనకు పాండిత్యం అవసరం లేకపోవచ్చు; కాని పరిణత సంస్కారం కావాలి. అది ఏ ఒక్క రంగంలో ఉన్నా రచయిత ఇరుకులో పడతాడు. ఇరుకుల్లేని మనస్సును పెంచుకుంటే ఇలాతలమంతా దృగ్వలయంలో మసలుతుంది. మనిషి చుట్టూ ఆదిప్రదక్షిణం చేస్తుంది. ఆ మనిషిని ఆ వలయంలో విలువ కట్టే విజ్ఞాన ముంటే చాలు పత్రికను ప్రజా హృదయానికి ప్రతిధ్వనిగా ప్రతిబింబింప జేయవచ్చు. స్వతంత్ర సంపాదకత్వంలో గోరాశాస్త్రిగారు సాధించిన స్వతంత్రత అదే నని సహృదయులు గమనించారు. విభిన్న దృక్పథాలను ఆహ్వానించటం, వివేచనను రచనల ద్వారా వెలికి తీయించటం, శక్తి యున్న రచయితలను ప్రోత్సహించటం, సమకాలీన రచనా కేంద్రాన్ని విస్తరించటం 'స్వతంత్ర' సాధించిన పత్రికాప్రవృత్తి వివిధ రచన లన్నీ వైవిధ్యాన్ని వెలయించాయి. వైవిధ్యాన్ని వ్యక్తిత్వంతో వ్యాఖ్యానించింది వినాయకుని వీణ.

గోరాశాస్త్రి గారు ఒక పళాన దేన్నీ మెచ్చుకోరు. మెచ్చుకోవటానికి తానేమి ప్రమాణాలు పెట్టుకున్నారో జనానికి చెప్పరు. ఒకసారి ఒక సిద్ధాంతంలో ఒక ప్రయోగాన్ని ప్రశంసిస్తారు. మరోసారి ఆ సిద్ధాంతం చెప్పే మరో సూత్రాన్ని సమర్థించరు. ఒకసారి అభ్యుదయవాదిలా కనపడతాడు. మరోసారి పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించినట్లు కనపడతారు. ఒకసారి సంప్రదాయాన్ని సమర్థించినట్లు కనపడతారు. మరొకసారి సంప్రదాయాన్ని విమర్శించి తిరుగబడతారు. ఎదుట ఉన్నదాన్ని ఏకరువు పెట్టటమే ఈయన మతం- అని అనిపిస్తుంది. స్థూలంగా వారి పత్రికా రచనలు చదివితే అందరూ ఆయన మీద అసమ్మతిని ప్రకటించినా ఆయన చెప్పే దానిలో సమన్వయం కుదరని సమీక్షలు ఉన్నాయని గమనించినా ఆయన మౌలికంగా ఆలోచిస్తా డన్నది అందరూ అంగీకరిస్తారు. ఆ మౌలికత ఏమిటి? అని ఆలోచిస్తే దాశరథిగా రన్నట్లు ఆయన స్వతంత్రత.

గోరాశాస్త్రిగారి శైలిని చూచినకొందరు, వాద ప్రతిపాదనాన్నిచూచి కొందరూ, ఆవేశాన్ని చూచి కొందరూ, ఆలోచన పద్ధతిని చూచి కొందరూ, వారి రచనలు మెచ్చుకునే పఠిత లున్నారు. అన్నింటికీ వెనుక ఉండే ఆయన వ్యక్తిత్వం కొందరికి నచ్చింది. ఆయన ఏ ఒరలోనూ ఇమడని కత్తి. ఒరలో ఇమిడితే లోకానికి నిర్భయం. ఇమడకపోతే ఎక్కడ విరుచుకు పడుతుందో అని వితర్కం. లోకాన్ని ఈ వితర్కంలో పెట్టే వింతవ్యక్తిత్వం గోరాశాస్త్రిగారిది.

వారి కలానికి వాడి వారి ఉక్తిలోని శక్తి. ఆధునిక వచనశైలిని నిర్మించిన వారిలో గోరాశాస్త్రిగా రొకరని సాహిత్య విమర్శకు లంటున్నారు. కథలు రాసినా, నాటికలు రాసినా, వ్యాసాలు రాసినా, సంపాదకీయాలు చేసినా పఠితలు ఊహించని ఏకోణం నుంచో లోకాన్ని చూచి ఎంతోవాడిగా చెప్పే నైపుణ్యం వారికి సహజ లక్షణం.

రోజూ వాడిగా చెక్కుకునే పెన్సిలుముక్క - వారి రచనలకు ప్రతీకాత్మక ప్రతిబింబం. 'స్వతంత్ర'లో నేర్చుకున్న కళ అది. దాని వాడిదనంలాగానే వారి రచనల్లోని వాడిదనం కలకాలం నిలిచేది. వారం వారం రాసే రచనల్లోనుంచే తరంతరం చెప్పుకొనే వెలుగులు కుమ్మరించారు. ప్రతి దినం వెలిగించే దీపం నుండే పదికాలాలు నిలిచే తేజం సృష్టించారు. మనిషిని మనిషిగా చూచే మనీషి గోరాశాస్త్రి!

2-1-1977 జి. వి. సుబ్రహ్మణ్యం.

# బహిరంగ లేఖ

ఇపుడు ముఖాముఖి నన్నెవరైనా అంతమాట అనడానికి సంకోచిస్తారు గాని, చిన్నప్పుడు నన్నంతా కోతలరాయుడనేవారు. అసలు మా వంశమే తరతరాలనుండీ అబద్ధాలకు ప్రసిద్ధికెక్కిందని ప్రతీతి. వంశగౌరవం నిలబెట్టుకోవడం ప్రతివాడూ చెయ్యవలసిన పనేగనక చిన్నపుడు యథాప్రకారం నా ప్రయత్నం నేను చేసేవాడిని. ఇప్పటి సంగతి సరే. నలుగురితోపాటు నారాయణ అనే సూత్రాన్ని అమల్లో పెడుతున్నాను. ఇది అప్రస్తుతం. చిన్నప్పటి సంగతి అసలు విషయం-మన్యప్రాంతంలో ఉన్న ఒక కుగ్రామంలో చదువుకునేవాణ్ణి. హైస్కూల్ కూడ అడవిమధ్యలో ఉండేది. ఎండాకాలం సెలవులకి పట్నం వెళ్ళేవాడిని. అంచేత నాతో చదువుకునే కుర్రాళ్ళకి నన్ను చూస్తే ఇదిగా ఉండేది, పట్నం వింతలు చూసి వస్తుంటాడు గదా అని. ఆ సదవకాశాన్ని పురస్కరించుకుని నేనూ వాళ్ళతో శక్తిలోపం లేకుండా పట్నం వింతలు చెప్పేవాడిని.

ఒకసారి బడి తెరిచాక, కుర్రాళ్ళని పోగుచేసి చెప్పాను, రాజమండ్రిలో ట్రాంబండి వేస్తున్నారు అని. అబద్ధం అన్నాడు విన్నవాళ్ళలో ఒకడు. పీకబలంకొద్దీ గట్టిగా అరచి, వేస్తున్నది నిజమేనని, వేసితీరుతున్నారని అన్నాను. చివరికి నేనే గెలిచాను. నన్ను ఎదిరించినవాడు రాజమండ్రిలో ట్రాంబండి వేయడంలేదని రుజువు చేసుకోలేకపోయాడు. అలాగే గోదావరి గట్టున దక్షిణం వేపు అడవిలో పెద్దసైజు రేగిపళ్ళు పండుతున్నాయని చెప్పేవాణ్ణి. అందులో నిజమెంతో అబద్ధమెంతో వాళ్ళు తెలుసుకునే అవకాశం లేకపోయేది.

మనిషి తత్వంలోనే ఓ గుణం ఉంది. నలుగురికీ తెలియంటీ తనకేదైనా తెలిస్తే అది వెంటనే ఎవరికైనా చెప్పాలని తహతహ ఉంటుంది. ఇక్కడ ఓ సందేహం రావచ్చు-శాస్త్రజ్ఞులూ, పండితులూ తమకు తెలిసినదాన్ని అతిగుప్తంగా ఉంచడానికి ప్రయత్నిస్తారే ఆ సంగతేమిటని? నిజం. కాని ఏ విషయాలు గుప్తంగా ఉంచితేగాని మనుగడ నడవదో, ఏవి రహస్యంగా ఉంచి ఉపయోగించుకోవడంవల్ల జీవనోపాధి ఉందో అది జాగ్రత్తగానే కాపాడుకుంటాం. మామూలు మనుషుల ప్రకృతి ఏమంటే ఒకళ్ళు చెప్పిన సమాచారం గాని, విషయంగాని సరిఅయినది కాదని తెలిసినపుడు, వెంటనే లేచి మనకి తెలిసింది ప్రకటించి అవతలి మనిషిని సరిదిద్దాలనిపిస్తుంది. రైలు ప్రయాణంలో కావలిస్తే చూడండి. ఒక పెద్ద అబద్ధం సగం వినబడేట్టు అనేసినా చాలు-చుట్టూ ఉన్న గొంతుకలు అందుకుంటాయి. ఈ రైలుబండి వందమైళ్ళ

వేగంతో పోతోంది కాబోలు అంటే, అబ్బే అదేమిటండీ! అలా అంటారు. మీకు ఇండియాలో రైళ్ళ స్పీడు తెలియనట్టుగా ఉంది! అని ఒకళ్ళు అందుకుంటారు. అక్కడి నుంచి ఇండియాలో అమిత స్పీడుతో పరిగెత్తే రైళ్ళు ఏవేవి అయింటీ. అవి ఏవేవో, డక్కనుక్వీను, తుపాన్‌మెయిలూ, ఆ వివరాలన్నీ అంకెలతోసహా బయటపడతాయి. అంకెలతోసహా రుజువు చేస్తుంటే కాదనడం ఎలాగా?

చిన్నపుడు నాతోటి కుర్రాళ్ళకి నేను రాజమండ్రిలో ట్రాములు ఉన్నాయంటే నిజమో కాదో రుజువు చేసుకుందికి అవకాశం లేకపోయింది. గట్టిగా అటువంటి అబద్ధం ఆడేసి నేను తప్పించుకోగలిగాను. కారణం నేను పరిమితమైన కుర్రాళ్ళ మధ్య ఆ మాట అన్నాను. వాళ్ళకి అప్పట్లో నన్ను జయించడం ఎలాగో తట్టలేదు.

అలాగే నేను పెరిగి పెద్దవాణ్ణయ్యాక ఏ రాజకీయవేత్తనో, ఏ ప్రఖ్యాత కళాకారుణ్ణో, వేదాంతినోఅయి, కుర్రాళ్ళ మధ్య కాక బహిరంగసభల్లో ఉపన్యసించో, పత్రికలలో ప్రకటనలు చేసో, ఉన్నవీ లేనివీ గంభీరంగా తెలియజేస్తే, ఈ రోజుల్లో తప్పించుకుందికి వీల్లేదు. ఉపన్యాసం విన్నవాళ్ళలోనో, వ్యాసం చదివిన వాళ్ళలోనో, ఓ బుద్ధిమంతుడు నన్ను సరిదిద్దడానికి ఠపీమని లేచి నడుం కడతాడు. వెంటనే పత్రికల్లో ఓ బహిరంగ లేఖ రాసిపారేస్తాడు. ఫలానా సుప్రసిద్ధ రాజకీయవేత్త ఐస్‌లాండులో సాంఘిక నాటకాల ప్రదర్శనంమీద వినోద పన్ను లేదనడం సాహసం. గత సంవత్సరం ఐస్‌లాండు నాటక సమాజంవారు వార్షిక నివేదికలో పన్ను తీసివేయవలసిందనే ఉద్యమం, ఇంకో అడుగు ముందుకు వేసిందని స్పష్టంగా పేర్కొనబడింది అని బహిరంగ లేఖలో ఉద్ఘాటిస్తాడు. ఇంక నాకు మాట పెగలడానికి అవకాశంలేదు. ఇంత పరిశోధన ఎవరు సాధించారు అనే ధైర్యంతో ఏదో అనేస్తే అంతకంటే ఎక్కువ పరిశోధనే సాగించిన పెద్దమనిషి ఎదురవుతాడు, పత్రికలో, బహిరంగ లేఖలో.

ఏ సుముహూర్తాన ఈ బహిరంగలేఖ అనేది కనిపెట్టబడిందో కాని, అది ఇవాళ మన నాగరికతలో, సంస్కృతిలో, ఒక భాగమై కూర్చుంది. నేడు ప్రపంచంలో, ఏ దేశం, ఏ భాషా పత్రిక తిరగవేసినా మనముందు సాక్షాత్కరిస్తుంది. లండన్‌టైమ్స్ పత్రికవాళ్లు ఈ బహిరంగలేఖ రాసేవాళ్ళ గురించీ, ఆ మధ్య పరిశోధనలుచేసి గత నూటయాభై సంవత్సరాల నుండీ ఆ పత్రికలో అచ్చుపడ్డ లేఖల్ని పరిశీలించి, ఒక విషయం తేల్చారు. అందులో నూటికి తొంభైపాళ్ళు కష్టాలు ఏకరువు పెట్టేవేనని. స్థానిక అధికారులూ, నాయకులూ, ఇంకా రకరకాల సంఘం పెద్దలు—వీళ్ళవల్ల ప్రజలు పడే రకరకాల బాధలే

యెక్కువ భాగం సంపాదకలేఖలలో చిత్రించబడ్డాయని. ఇంకొన్ని మొదట్లో ఉదహరించిన పెద్దల సుద్దులలోని అపకతపకలను బయటపెడతాయి. ఒక్కొక్కపుడు యీ సంపాదలేఖల శీర్షికలో ఒక సమస్య గురించి కురుక్షేత్రంలో సంగ్రామం అంతటి ఘోరయుద్ధాలు జరగడం కూడా కద్దు. ఇంకా కొన్ని రకాల అద్భుతాలను ప్రపంచానికి ప్రకటిస్తుంటాయి.

మా ఊరికి ఉత్తారాన తోపులో ఒక తాటిచెట్టు కదిలితే 'శ్రీరామ, శ్రీరామ' అనే ధ్వని వినపిస్తుంది. జనం ఆశ్చర్యంగా చూస్తున్నారు అంటా డొక లేఖకుడు.

నిన్న సాయంత్రం మా ఊరికి దక్షిణంగా ఆకాశంలో తోకచుక్క కనబడింది. అది దేశానికి అరిష్టదాయకమని మా దేవాలయం పూజారి భావిస్తు న్నాడు అంటాడింకో విలేఖరి.

అది చదివిన యింకో ఛోటా శాస్త్రవేత్త అది తోకచుక్కకాదు, మిలటరీ విమానం తాలూకు తోకదీపం. కావలిస్తే యీ విషయం మిలటరి శాఖవారినడిగి నిర్ధారించుకోవచ్చు అని ఇంకో బహిరంగలేఖ అదే పత్రికలో ప్రకటిస్తాడు.

మిలటరీశాఖ కార్యాలయం పబ్లిసిటీ ఆఫీసరు ఇంకో ఉత్తరం రాస్తూ మిలిటరీశాఖకు యీ విషయమై ఏమీ సమాచారం లేదు అంటాడు.

ఇలా తరనభర్జన జరిగాక చివరికి ఆ సంపాదకుడు ప్రాణం విసిగెత్తి ఈ చర్చ ఇంతటితో ఆఖరు అని ప్రకటిస్తాడు—ఇంట్లో రేగిన పోట్లాట దుమా రాన్ని ఇంక చాలు ఊరుకొండి అని ఆజ్ఞాపించే ఇంటిపెద్దలాగ. కొన్ని సమస్యలు అంతటితో ఆగవు. ఇంకో పత్రికలో ఈ లేఖకులందరూ చేరి కొత్త యుద్ధం ప్రారంభిస్తారు, ఇంట్లో పోట్లాట అయాక, పెరట్లో కాస్సేపటికి మళ్ళీ కొత్త పాట రేగినట్లు. ఈ విధంగా యీ సంపాదకలేఖల శీర్షిక ద్వారా సమాజం అంతా ఒక కుటుంబంలాగ ఎక్కడేమూల గొడవ జరిగినా అందరూ పట్టించుకుని చర్చిస్తారు. ఇదీ ప్రజాస్వామ్యంలో ఓ భాగమేనని తెలిసిన వాళ్ళంటారు. వాళ్లను నమ్మడం తప్ప మనకి గత్యంతరంలేదు. పత్రికలూ, ప్రజాస్వామికులూ, యీ సంపాదకలేఖలూ, అన్నీ ఇంచుమించు ఒక్కమాటే పుట్టి, ఒకదాని ఆసరాతో ఇంకొకటి పెరుగుతూ వస్తున్నపుడు కాదనడం ఎలాగా? ప్రజాస్వామ్యం లేని రోజుల్లో బహిరంగలేఖ లేదనే అనవొచ్చు. రామరాజ్యం తీసుకుందాం. అప్పట్లో ప్రజలకేమయినా కష్టం కలిగితే, స్థానిక కేంద్ర పరిపాలనా విషయాల్లో ఏదయినా అన్యాయం జరిగితే సరాసరి శ్రీరాముడి దగ్గరికి వెళ్ళి నివేదించు

కోడానికి అవకాశం ఉండేది. సమస్త శాఖలూ అతగాడి చేతిలోనే ఉండేవి కనక ప్రజలకూ సులభంగానే ఉండేది. రాజుగారి కొలువుకూటం దగ్గర గంట వాయిస్తే స్వయంగా రాజేవచ్చి సంగతంతా వినేవాడు. ఇప్పుడో? కాలం మారింది. పరిపాలనా వ్యవస్థ మరీ మరీ క్లిష్టమయింది. ఉదాహరణకి చూడండి– తుమ్మపూడి ట్రంకురోడ్డు అనుకుని ఉన్న గ్రామం అనుకుందాం. ట్రంకురోడ్డు మరమ్మత్తు ఒక శాఖవారిది. ట్రంకురోడ్డు నుంచి ఊళ్ళోకి దారి మరమ్మత్తు ఇంకొకరిది. రెండింటికీ కనక ఒక సుయ్యి ఉంటే, ఇంక ఆ సుయ్యి మరమ్మత్తు ఎవరి బాధ్యతో ఒక్కొక్కపుడు హైకోర్టు కూడా నిర్ణయించలేదు. ఇక ఆ గ్రామస్థులకి ఏం దారి? ఎవరిని అడగాలో తెలియదు. వెంటనే గ్రామంలోని ఓ స్థానిక పత్రికకి తుమ్మపూడి సుయ్యి–ప్రభుత్వ బాధ్యత అని ఓ గంభీరమైన లేఖ వ్రాసి పంపుతాడు. సుయ్యి బాధ్యత ఎవరిదైనా తనది మాత్రం కాదు కనక సంపాదకుడు ఆ లేఖను ప్రకటిస్తాడు.

ఇంకా జీవకారుణ్యం ఎక్కువగా ఉన్న సంపాదకుడయితే, లేఖకింద ఓ వ్యాఖ్య కూడా అతికిస్తాడు, స్వతంత్ర భారత దేశంలో కూడా ఇంకా తుమ్మపూడి సుయ్యి సమస్య పరిష్కరించబడకపోవడం శోచనీయం అని. ఎందుకో ప్రజలు ఎన్ని మహజర్లు పంపుకున్నా మేలుకోని అధికార్లు, పత్రికలో లేఖ చూశాక కనీసం ఆ లేఖ గురించి ఆలోచిస్తారు. కొన్నివేళల్లో తమ అభిప్రాయం కూడ వెంటనే ప్రకటిస్తారు. బడ్జెటు ప్రకారం తుమ్మడిపూడి సుయ్యి మూడేళ్ళకొకసారి బాగుచేయవలసియుంటుందనీ, ఇంకా శీఘ్ర వ్యవధిలో చేయించాలంటే ధనవ్యయం అవుతుందనీ, అసలే పన్నులు ఎక్కువగా ఉన్న యీ రోజుల్లో తుమ్మపూడి సుయ్యి మరమ్మత్తుకోసం, ఇంకా పన్నులు వేయడం, ప్రజాస్వామిక ప్రభుత్వానికి యిష్టంలేదనీ. ఈ రకంగా సుయ్యి చివరకు మరమ్మత్తు అవుతుందా అన్నది వేరే సమస్య. ఆ సుయ్యి గురించి యింత రాద్ధాంతం జరగడమే ప్రజాస్వామ్యానికి నిదర్శనం. తుమ్మపూడి గ్రామస్థులు సుయ్యికోసం పడే బాధ భరించలేక ప్రజాసేవకులెవరయినా తుమ్మపూడి సుయ్యి మరమ్మత్తు ఫండు అంటూ ప్రారంభించి నడుంకట్టినా కట్టవచ్చు.

ఈ విధంగా పత్రికలకి బహిరంగలేఖలు వ్రాసేవాళ్ళలో లోకహితార్థ చింతన ఎంత భాగం, అచ్చులో తమ పేరు చూచుకునే ఆసక్తి ఎంత భాగం అన్న ప్రశ్నకు సమాధానం చెప్పడానికి పూనుకోవడం కూడా సాహసకరమే క్షీరనీర న్యాయంలాగ సంపాదకలేఖల శీర్షికలో అవి విడదీయలేకుండా తరచు ప్రవహిస్తుంటాయి.

రాస్తాడు ఒక పౌరుడు: నిన్న సాయంత్రం రైల్వేస్టేషనుకు నేను వెళుతుంటే పబ్లిక్ దీపాలు సరిగాలేక కాలుజారి చిన్నగోతిలో పడవలసి వచ్చింది.

అధికారులు ఈ విషయమై ఎందుకు శ్రద్ధవహించడంలేదో నాకర్థం కావడంలేదు అని.

ఇంకో మహనీయుడు ఆగ్రహిస్తాడు: స్థానిక పోలీసు ఇన్స్పెక్టర్ గారి జులుం చాలా అధికంగా ఉంది. వీరిని వెంటనే అధికారులు యిక్కడినుండి బదిలీ చేయించవలెను అని.

ఇలా రాసే వ్యక్తులు తమ పూర్తి పేరు వుత్తరం అడుగున ఇవ్వరు. 'పౌరుడు' అనో 'ప్రభుత్వహితుడు' అనో 'బాధితుడు' అనో గుప్తనామం వాడతారు.

సంపాదకులు గుప్తనామాలకంటే పూర్తిపేరుకే ఎక్కువ ఆదరణ చూపుతామని ప్రకటించినా, గుప్తనామాల ఉత్తరాలు పూర్తిగా ప్రకటించడం మానేయలేదు. కొన్నివేళల్లో పూర్తిపేరు ప్రకటించుకోలేని స్థితిలో ఉన్నవాళ్ళు దారుణమైన అన్యాయాలను బహిరతం చేయగలుతారు. అటువంటివారిని స్థానిక అధికార వీరుల బారినుండి రక్షించాలంటే, వాళ్ళపేర్లు రహస్యంగా ఉంచడం తప్ప గత్యంతరలేదు. ఒక్కొక్కపుడు అతిశయోక్తులు కూడా గోరంతలు కొండంతలై లోకానికి చాటబడడం జరుగుతుంది. కాని సంపాదకులు తరచు శీర్షికపైన ప్రకటిస్తున్నట్లు పాఠకుల ఉత్తరాలు విశ్వాసంమీద నమ్మకంమీదా ప్రచురింపబడతాయి. తమ ఆఫీసుకు వచ్చిన ప్రతి ఉత్తరంలోని నిజానిజాన్ని పరిశీలించి తృప్తిపడినమీదటగాని ప్రకటించకూడదనుకంటే, ఏ ఉత్తరమూ ప్రకటించడానికి అవకాశం ఉండదు. సంపాదకుడు చూసేది, ఉత్తరం వ్రాసిన వ్యక్తి పూర్తి చిరునామా ఇచ్చాడా లేదా? వ్యక్తి దూషణ లేకుండా సమస్యనే ఎత్తుకున్నాడా లేదా? క్లుప్తంగా రాశాడా లేదా? అని. అయితే ప్రకటించవచ్చు. ఆపైన నిజానిజాలు తరువాత తేలుతాయి. ఆ బహిరంగలేఖల ధోరణీ, వాటి కంఠధ్వనీ, అవి ప్రకటింపబడే పత్రికల అంతస్తునిబట్టికూడా ఉంటాయి. ఉన్నత మార్గాన నడిపింపబడే పత్రికల్లో అట్టహాసాల లేఖలు చోటు సంపాదించ లేవు. అలాగే కేవలం అల్లరి ఆందోళనా ప్రధానంగా పెట్టుకున్న పత్రికలలో లేఖలు సాధారణంగా తిట్టు కవిత్వపు ధోరణిలోనే ఉంటాయి. అధికారులు వాటిని అంతంత మాత్రంగానే ఆదరిస్తారు. జనం మధ్య టపాకాయపేల్చే శూరత్వమే ఈ ఉత్తరాల్లోనూ ఉండటంచేత వాటివల్ల ఫలితాలు శూన్యం అవుతాయి. చదువుకునేవాళ్లకి కాపేపు కాలక్షేపం అవుతుందిగాని ఆలోచన రేకెత్తించవు.

కొన్ని కొన్ని పత్రికలు తిరగవేస్తుంటే బహిరంగలేఖల శీర్షికలో కొన్ని కొన్ని పేర్లు ఇంచుమించు రోజూ కనిపిస్తుంటాయి. అంటే సంపాదకలేఖలు

రాయడం ఒక పౌరధర్మంగా, ఒక లలితకళగా భావించి ఆరాధించే లేఖక కవులు కొందరుంటారు. దినపత్రికలన్నీ చదివి ఎక్కడే నాయకుడు ఏమంటాడో శ్రద్ధగా చూసి, అందులో ఆవగింజంత పొరపాటయినా దొరికితే పెన్నిధిగా భావించి, కూర్చుని ఒక సుదీర్ఘమైన సంపాదకలేఖ రచించి పోస్టు చేస్తారు.

జవహర్‌లాల్‌నెహ్రూగారు ఇటీవల ప్రసంగిస్తూ భారతంలో శ్లోకాలు లక్షయాభైవేల పదహారు అన్నారు. అది సరికాదు. ఈ విషయంలో మాక్స్ ముల్లర్ పండితుడు పరిశోధనచేసి 1829లో వ్రాసిన గ్రంథంలో భారతంలో శ్లోకాల సంఖ్య లక్షయాభైవేల పన్నెండే అని రూఢిగా తేల్చాడు.

వీళ్ళ ఉత్తరాలు ఈ ధోరణిలోనే ఉంటాయి. లండన్‌టైమ్స్ చేసిన పరిశోధనలో, ఒక ఆస్ట్రేలియా పౌరుడు తన జీవితకాలంలో పత్రికలకు మొత్తం రెండువేల బహిరంగలేఖల్ని వ్రాశాడని తేలింది. రెండువేల బహిరంగలేఖలు వ్రాయడం అంటే సామాన్యమైన విషయం కాదు. అన్ని లేఖలు వ్రాసి అతడు అచ్చులో వేయించుకోగలిగాడంటే, ప్రజాస్వామ్యపు యుగకర్తల్లో అతడొకడని నిస్సందేహంగా మనం నమ్మవచ్చు.

నీ కళ్ళ ఎదురుగా ఘోరమైన అన్యాయం జరుగుతుంటే దాన్ని ప్రతిఘటించి తిరగబడడమే నీ కర్తవ్యం అన్నాడొక తత్త్వవేత్త. అమోఘమైనసూత్రం. పూర్వం అన్యాయం జరిగితే ధైర్యం ఉన్నవాడు తిరగబడేవాడు, లేనివాడు బాధపడేవాడు. స్థానికంగా జరిగే అన్యాయం స్థానికంగానే నిలిచిపోయేది. అంత వరకూ ప్రతిఘటించినవాడికి పరిమితమైన సహాయమే ఉండేదన్నమాట. నేడో? అన్యాయాన్ని బహిరతంచేసి, ప్రజాదృష్టి అటు మరల్చడానికి వెనుకటిరకం ధైర్యం అక్కరలేదు. కాగితం కలం తీసి దినపత్రిక్కి ఓ ఉత్తరం రాసేస్తే చాలు. ఇంత అవలీలగా అన్నీ అందరికీ తెలిసేటటుచేసే ఆయుధం దొరికిన కొత్తలో సంగతి మనకు తెలీదుగాని యీ రోజులో యీ ఆయుధం సక్రమంగా వినియోగం అవుతున్నదనే పూర్తి హామీలేదు. ప్రతి చిన్న విషయాన్నీ రచ్చకీడ్చి, తనకి జరిగిన ప్రతి చిన్న అన్యాయాన్నీ లోకానికి చాటి, క్రమంగా యీ అలవాటు ఒక నిషావలే పరిణమించినవాళ్ళు ఇతోధికం అవుతున్నారు. దీనివల్ల నిజంగా అందరి దృష్టి ఆకర్షించవలసిన సమస్యలు, వాటి ప్రాముఖ్యాన్ని కోల్పోవడం సయితం సంభవిస్తుంది. పత్రికలకి ఈ బహిరంగలేఖల శీర్షిక ఎంత ముఖ్యమైన అంగంగా తయారైందో కొన్ని అమెరికన్ పత్రికలు తిరగవేస్తే తెలుస్తుంది.

నిజంగా అటువంటి ఉత్తరాలు రాసారా లేక పత్రికా కార్యాలయాల్లో అవి ప్రచురింపబడతాయా అని సందేహించవలసివస్తుంది. ఉన్నచోటులోనే

వీలయినన్ని ఎక్కువ ఉత్తరాలు ప్రకటించబడాలనే తహతహకొద్దీ సంపాదకులు ఉత్తరాలు కత్తిరించి కత్తిరించి అచ్చువేస్తారు. కొన్ని పత్రికలు కేవలం ఏకవాక్య జనవాక్యాలనే అచ్చువేస్తాయి. ఒక పాఠకుఁడు ప్రశ్నిస్తాడు: కొరియా యుద్ధం ఎందుకు జరుగుతోంది? అని. అంతే ఉత్తరం అంతా కలిపి.

ఇంకో పాఠకుడు విసుక్కుంటాడు: ఫలాని రాజకీయవేత్త ఇంకా ఎందుకు బతికి ఉన్నాడు? అని.

ఆ మధ్య అమెరికా పత్రిక ఒక దానిలో ఒక లేఖ ప్రచురింపబడింది. దాని సారాంశం యిది: రాత్రి తొమ్మిదిగంటలవేళ గృహస్తు యింటికొచ్చి భార్యతో ముచ్చటగా కాలక్షేపంచేసే ఘడియల్లో పక్కనే రేడియోలోంచి అంతర్జాతీయ వార్తలు వినిపిస్తే ఎలాగ ఖర్మ. ఉల్లాసకరమైన శృంగార సంగీతం వినిపించాలి గాని; అదీ ఉత్తరం. అతడి పడకటింటి సమస్య మనం కూడ దేశ సమస్యగా భావించాలని అతని ఉద్దేశ్యం.

మొత్తంమీద బహిరంగలేఖల శీర్షిక ఒక రచ్చసావిడి. సమాజ జీవితం లోని ఎత్తుపల్లాలూ, సుఖదుఃఖాలూ అందులో ప్రతిఫలిస్తుంటాయి. ఇక్కడ గమనించదగిన విషయమేమిటంటే. సంపాదకుడి చిత్తుకాగితాల బుట్టలో పడిపోగా మిగిలినవి ఇంత ఆహ్లాదకరంగా ఉంటే, ఇక అచ్చుపడనివి ఎంత చరిత్ర చెప్పగలిగేవిగా ఉంటాయోనని; ఈ సత్యాన్ని గ్రహించి కేవలం బహిరంగలేఖల ప్రచురణకోసమే ఒక పత్రిక స్థాపించినట్లయితే దిగ్విజయంగా ఉండొచ్చు. అటువంటి పత్రిక బయల్దేరినా మనం ఆశ్చర్యపడవక్కరలేదు. ఇది ప్రజాస్వామ్య యుగం.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో).

—•••—

—"తెలుగు స్వతంత్ర"
ఏప్రిల్ 20, 1951.

రాను రాను దేశంలో రాజకీయాలే జీవిత సమస్తమూ అయిపోతున్నాయని యీ మధ్య ఒక పత్రిక సంపాదకీయ వ్యాఖ్యలో నిట్టూర్చింది. కళా, సాంస్కృతిక రంగాలూ, భాషా సాహిత్య రంగాలూ—వీటిని అందరూ విస్మరిస్తున్నారనీ, అది జాతి అభ్యుదయానికి మంచిది కాదనీ—జ్ఞాపకంచేస్తూ ఈ విషయంలో మన నాయకులు వహించవలసిన బాధ్యత చాలా ఉందని అభిప్రాయపడింది. సాధారణంగా రాజకీయ సంరంభం తప్ప ఇంక ఏ అలికిడినీ గుర్తించని దినపత్రికల దృష్టికే పరిస్థితి ఇంత దిగజారిపోయిందంటే, నేటికైనా యీ రుగ్మతను కొందరు గుర్తించడం గుడ్డిలో మెల్ల భావాంకురం కలిగాక, అది నెమ్మదిగా ఒకరినీ, ఇద్దరినీ—అలా కొందరినైనా కదిలిస్తుంది. మార్పు సాధించడానికి అవగాహన అనేది మొదటిమెట్టు.

ఆ మధ్య—అంటే నాలుగైదేళ్ళక్రితం, అమెరికన్ యువకుడొకడు అలా అలా భూసంచారం చేస్తూ మద్రాసు వచ్చాడు. వయస్సులో చిన్నవాడు; అంటే పాతికేళ్ళు నిండనివాడు. అప్పటికప్పుడే యుద్ధంలో పాల్గొని, తరువాత అమెరికాలోని భూతలస్వర్గం ఇవ్వగలిన భౌతిక సుఖాలన్నిటినీ చవి చూసి—ఆధ్యాత్మికంగా ఏదో శూన్యత్వంతో బాధపడి, తీవ్రమైన అసంతృప్తితో ప్రపంచ యాత్ర బయలుదేరాడు. అజ్ఞాతంగా ఇండియా అంతటా తిరిగాడు; అమెరికా వాడైనా ఎంచేతనో బీదవాడు. ఎంతో క్లుప్తంగా జీవిస్తూ తనంతట తనే వండుకునేవాడు. ఇండియాలో ఏ ప్రాంతానికి వెళ్ళినా, మామూలు మధ్యతరగతి వాళ్ళతోనే పరిచయం ఏర్పరుచుకొని, వాళ్ళతోపాటు భోజనాలు చేసి, మన సంస్కృతీ, సంప్రదాయాలు, అర్థం చేసుకునేందుకు ప్రయత్నించేవాడు. ఒకనాడు బీచీఒడ్డున కూర్చుని, బాతాఖానీగా తన అనుభవాలు వివరిస్తూ అన్నాడు: ''నాకు బోధపడినంతవరకూ—ఎక్కడ చూసినా మీ పబ్లిక్ లైఫ్ లో రాజకీయాలు తప్ప యింకేమీ కన్పడలేదు. విశ్రాంతి సమయాల్లో నలుగురూచేరి రాజకీయాలు మాటాడుతారు. పత్రికల్లో కూడా రాజకీయాలకే పెద్దపీటలు వేస్తారు. నేను మిమ్మల్ని ఏదో విమర్శిస్తున్నాననుకోకు. ఇంత మితిమీరిన మోతాదులో రాజకీయాలు మీరెందుకు ఆరాధిస్తారో తెలియక ఆశ్చర్యపోతున్నాను. అంతే'' అన్నాడు.

అలాగే ఇంకా కొన్ని అభిప్రాయాలు చెప్పాడు సహృదయంతో, నమ్రభావంతో. ''అమెరికాలో జాజ్ సంగీతం జాతి సంస్కృతినెంతో పాడుచేసింది. యువతీయువకుల సంస్కారంలో చిలిపితనం, పసితనం ఎక్కువచేసింది. అయితేనేం—ఆ జాజ్ సంగీతంలాంటిది ఏదైనా యిక్కడ అందరికీ అందించగలిగితే బాగుండును. అపుడు మీ సాంఘిక జీవనంలో దేనికి ఉండ

వలసిన విలువ దానికి ఉంది? ఈ రాజకీయాల బలుపు కొంత తగుతుందేమో!'' అన్నాడు. ఇటువంటి పరిస్థితి ఎందుచేత వచ్చిందో వివరించడానికి ప్రయత్నిస్తూ—కలకాలం బానిస జాతిగా ఉండిపోవడమే కొంతలో కొంత అందుకు కారణమని సమర్థించబోయాను. శ్రద్ధగా విని మళ్ళీ అడిగాడు: ''పోనీ అలాగే అనుకుందాం; ఇపుడు స్వాతంత్ర్యం తెచ్చుకున్నారుగా!'' ఒక్కసారిగా మార్పు రావాలంటే కష్టం అన్నాను. క్రమంగా మళ్ళీ సమాజం సర్వతోముఖంగా కొత్తచిగుళ్ళు తొడుగుతుందన్నాను.

అన్నానే గాని ఎన్నేళ్ళు గడిచినా ఆ కొత్త చిగుళ్ళెక్కడా కనిపించడం లేదు. పైపెచ్చు స్వాతంత్ర్యానికి పూర్వపు రోజులకంటే పరిస్థితులు అన్ని రంగాల్లోనూ అధ్వాన్నంగా తయారయాయి. యివాళ రాజకీయాలనే కబంధుడి హస్తంలో యిరుక్కొని జీవితవ్యాసంగం అంటూ ఏదీలేదు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 'రివైవలిజం' (పాత పాతవాటి పునరుద్ధరణ) ఒక వ్యామోహం కింద పరిణమించి నేడు మరీ వెర్రితలలు వేస్తోంది. వెనక్కి, యింకా వెనక్కి వెళ్ళిపోదామని గట్టిగా ప్రచారం చేసేవాడు యివాళ ఘనుడు. యీ తతంగం అంతా జాతీయవాదం పేరున చలామణి అవుతోంది. స్వాతంత్ర్యానికి పూర్వం అభ్యుదయవాదానికి సిద్ధాంతరీత్యా ఆయినా కొంత ఆదరణ ఉండేది. అభ్యుదయ నిరోధకులు అపుడూ ఉండేవారుగాని, బహిరంగంగా తమ కార్యక్రమాన్ని సమర్థించడానికి సిద్ధపడేవారుకారు. సంకోచించేవారు. ఆనాడు కులతత్వవాదుల్ని జాతీయోద్యమానికి వ్యతిరేకులుగా భావించేవారు. ఇవాళ వాళ్ళే అధినేతలవడం గాక, వాళ్ళ సిద్ధాంతాలే మనం అనుసరించదగ్గ ఆదర్శాలయాయి. అలాగే ప్రాంతీయ దురభిమానం, భాషా దురభిమానం, వరద్వేషం—యివన్నీ బ్రహ్మ రథం పట్టించుకుని సమాజంలో కర్పూరహారతు లందుకుంటున్నాయి. ఈ రకం పరిణామం వెల్లువలావచ్చి విలువలన్నీ చెరిపేసింది. స్వప్రయోజనాన్ని సాధించు కునే లక్ష్యం తప్ప తక్కిన లక్ష్యాలన్నీ అవివేకమనే నిస్పృహను సర్వత్రా కలిగించింది.

అందుకే నేడు యువకలోకాన్నీ, మేధావరాన్నీ ఉత్తేజపరిచే ఆదర్శా లంటూ ఏవీ లేకుండాపోయాయి. దేనిమీద నమ్మకం పెట్టుకోవడం? సంఘ సంస్కరణా? వరరహిత సమాజ నిర్మాణమా? కళోద్ధారణా? వ్యవహారిక భాషా వాదామా? దేనిమీదా విశ్వాసం లేదు. అటువంటివేవో ఆదర్శాలు పెట్టుకొని జీవితాలే వాటికి అంకితం చేసినవారంతా యివాళ నిరాశకులోనై తప్పుకున్నారు. జాతీయోద్ధరణపేరిట మూర్ఖత్వం స్వైరవిహారం చేస్తుంటే గత్యంతరం లేక మౌనం వహించారు. ఈ మధ్య ఆంధ్రదేశం పర్యటించిన ఒక మిత్రుడు ఒక

చిన్న ఉదంతం చెప్పి బాధపడ్డాడు. ఆయా ఊళ్ళలో ఉన్న పాత దేవాలయాల పునరుద్ధరణ పేరుతో అధికారులు యీ మధ్య కొంత కొత్త ఉత్సాహం చూపించి, వాటికి పరిశుభ్రంగా వెల్లవేయించి, శిథిలమైన భాగాలన్ని సిమెంటుతో తిరిగి కట్టేశారట. ఆ గోడలమీద శతాబ్దాల వెనకటి శాసనాలు చెక్కబడి ఉన్నాయి. దళసరిగా వెల్ల వేయించడంలో అవన్నీ పూడిపోయి, పరిశోధనలకు పనికిరాకుండాపోయాయి. సిమెంటు మరమ్మత్తులు దేవాలయాన్ని మరింత వికృతంచేసి, అపూర్వ కళాసంపద నేటి రంగురంగు సిమెంటు పూతలమధ్య పూడ్చేశారు. ఏ అధికారులు యీ ఉత్తరువులు జారీచేశారో, పద్ధతులు తెలియకుండా అంత బండగా ఎందుకు చేశారో—ఎవరికీ తెలియదు. అధికారం ఉన్నది వీటి సంగతి ఏమీ తెలియని రాజకీయవేత్తల చేతుల్లో. వారికి కావలసింది అక్కడికి వాళ్ళు వెళ్ళినప్పుడల్లా "దేవాలయ గౌరవలాంఛనాల"తో **(Temple honours)** ఆహ్వానించబడడం. అంతటితో గుళ్లో దేవుళ్ళూ శిల్పకళా సంపదా—అంతా తరించినట్టే.

అలాగే గ్రంథాలయోద్యమం. ప్రతి పంచాయతీకి కొంత సొమ్ము గ్రంథాలయాలకోసం మంజూరు చేసింది ప్రభుత్వం. ఏ పుస్తకాలు కొనాలో అనే నిర్ణయం స్థానిక పెద్దలకే వదిలేసింది. అంతటితో రభస మొదలు. ఎవరి అభిరుచుల్నిబట్టి వారికి తోచిన పుస్తకాలను వారు సూచిస్తున్నారు. భారతం అక్కర్లేదని కొందరు, ప్రబంధాలు అక్కర్లేదని కొందరు — తమ అభిమాన రాజకీయ గ్రంథాలు తప్ప యింకేవీ అక్కర్లేదని మరికొందరు. యిక్కడా రాజకీయాలే. వీటిని శాసించే రాష్ట్రీయ ప్రభుత్వాలనిండా రాజకీయాలే. వీటిని తప్పించుకునేందుకుగాని, అధిగమించి మళ్ళీ జాతీయ జీవనంలో సమగ్రమైన విలువల్ని పునఃప్రతిష్ఠ చెయ్యడానికిగాని, శక్యంగానంతగా యివి బిగిసిపోతున్నాయి. ఈ విషమ చక్రాన్ని ఛేదించేదెవ్వరు? ఎప్పుడు?

oOo

— తెలుగు స్వతంత్ర
(ఏప్రిల్ 16, 1954)

# వినాయకుడి వీణ

'విశాల దృక్పథం', 'అభ్యుదయ దృక్పథం', ఇలాంటివి అలవరుచు కోమని తెలిసిన పెద్దలూ, తెలియని (నన్ను) పత్రికలూ, తరచు హెచ్చ రిస్తుంటే సరేనని ఆ 'దృక్పథం'కోసం కష్టపడి ప్రయత్నిస్తూంటే యిటీవల ఓ తెలుగు దినపత్రిక యిలా వ్రాసింది: ''ఈ ఉత్సవాలు ప్రజల్లో చేనేత దృక్పథాన్ని కలించగలవని. . .ఆశిస్తున్నాము.'' చదివి కొది క్షణాలు అయో మయంలో పడిపోయాను. ''చేనేత దృక్పథం!'' అలవరచుకోవడం ఎలాగా? అంటే చేనేత వస్త్రాలపట్ల ప్రజల్లో ఆదరణ ఇతోధికం అవడం అని ఆ వాక్యాన్ని మళ్ళీ తెలుగులోకి తరుమా చేసుకుని అర్థం చెప్పుకున్నాను. స్వర్గీయ ముట్నూరి కృష్ణారావుగారు ఈ తెలుగు పత్రికలో భాగాలు ఎప్పుడైనా తమ కృష్ణాపత్రికలో పునర్ముద్రించవలసివస్తే, ''వాటిని ముందు తెలుగులోకి తర్జుమా చేయండి'' అని సంపాదకవర్గాన్ని ఆదేశించేవారట.

'చేనేత వారోత్సవం' తక్కిన దేశంతోపాటు తెలుగుదేశంలో కూడ జరిగింది. జరగవలసిన ప్రబోధాలు, ఉద్ఘోషలు, ఉద్ఘాటనలు, అభిభాషణలూ అన్నీ జరిగాయి; పేటికీ లోటులేదు. అలనాటి మొహెంజోదరో చేనేత పరి శ్రమ, డాకా మస్లిన్‌లు, వాటినుండి పొందూరు, ఉప్పాడ, బందరు, అన్నిటి ప్రసక్తి లాంఛనప్రాయంగా వచ్చింది. అంకెలూ, వివరాలూ తెలిశాయి. దేశం మొత్తంమీద ఉన్న మగాలు లెక్కపెట్టారు. తిండిలేని చేనేత పరిశ్రమవాళ్ళు ఎంతమందున్నారో అంచనా వేశారు. దీపాలు వెలిగించి బళ్ళు బజారుల్లో; అంతా సజావుగానే గడిచింది.

ఈ తతంగం అంతటికీ ఫలితం ఎలాగుంటుంది? ప్రస్తుతానికి మనకు తెలియదుగాని, మళ్ళీ యింకో ఉత్సవం యిలాంటిదివస్తే—అపుడు అంకెలూ, గణితాలూ వెలువడుతాయి. ఈలోగా ఆంధ్రదేశంలో యథాప్రకారంగానే చేపల బుష్‌కోట్లూ, హవాయ్ బీచ్‌సుందరుల బుష్‌కోట్లు, నైలాన్‌లూ, ఖటావ్‌లూ విశృంఖలంగా విహరిస్తూనే ఉంటాయి. చేనేత వస్త్రాలకంటే మిల్లుబట్టలు చవక అని కొందరు, మిల్లుబట్టలలోని నాజూకు, వైవిధ్యం, చేనేత వస్త్రాలలో ఉండవని మరికొందరు—యిలా ''చేనేత దృక్పథం'' అలవరచుకోలేనివాళ్ళూ, అలవరచుకోడానికి యిష్టంలేనివాళ్ళూ—వీరి సంఖ్య తగ్గదు.

అందుకు కారణాలు వేరే ఉన్నాయి. అవి జాతీయ సంస్థలలో కలుగు తున్న పరిణామానికి సంబంధించినవి. ఇవాళ మధ్య తరగతివర్గాల జీవనం కాస్త సూక్ష్మంగా పరిశీలిస్తే ముచ్చట వేస్తుంది. మన చిత్రకళాపిపాస గోడలమీద రంగురంగుల కాలెండర్లూ తీరుస్తున్నాయి. భక్తపర్యులకు సబ్బులకంపెనీలు

మహాలక్ష్మి, వినాయకుల పటాలు అందిస్తుంటే, రస్సైక జీపులకు బీడీలు, సిగ రేట్ల కంపెనీలు అర్ధనగ్న 'పూర్ణకుంభ' నారీమణుల త్రివర్ణ చిత్రాలు ప్రసాదిస్తున్నవి. అది మన చిత్రకళాభిరుచి; 'ప్లాస్టిక్' అనే పదార్థం ధర్మమా అని మనపిల్లలకి ఆటవస్తువులకి కొదవలేదు. ప్లాస్టిక్ మేనక, ప్లాస్టిక్ విశ్వామిత్రుడూ-అందరూ బేడ బేడ. మన యువతీయువకుల వస్త్రాలంకరణలకు సరే-నైలాన్‌లూ, టిష్యూలూ, పారాచూట్ సిల్కులూ ఉండనే ఉన్నాయి. ఇలా యంత్రయుగపు నాగరికత మనకొక సరికొత్త 'అంతరాతీయ' సంస్కృతిని ప్రసాదిస్తుంటే దీనిని పోల్చుకోలేని జాతీయ ప్రభుత్వాలు జాతీయ సంస్కృతి పునరుద్ధరణ పేరిట కుంభమేళాలు నిర్వహిస్తూ ఇంగ్లీషు భాష నిషేధిస్తూ ఇండియాను భారతదేశంగా, వీలయితే జంబూ ద్వీప భాగంగా మార్చడానికి ప్రయత్నిస్తున్నాయి. ఎవరి దారి వారిది; ఒక చెంప 'ప్లాస్టిక్' సంస్కృతీ 'హాలీవుడ్ సినిమాలూ, అమెరికన్ 'ప్లేబాయ్' 'రోమాన్సు' పత్రికలు తామరతంపరగా పెరిగి మన యువతీ యువకుల ఉత్కంఠల్ని సరిదిద్దుతూంటే ఇంకో చెంప రాష్ట్ర ముఖ్యమంత్రులు గ్రామాలలో ఆంజనేయ భజన సమాజాలకు లక్షల రూపాయల గ్రాంటులు మంజూరుచేస్తూ, కులవృత్తులు మంచివని సెలవిస్తూ, నిరీశ్వరవాదులు దేశద్రోహులని ప్రబోధిస్తూ 'ఇంగ్లీషు' చదువు బహిష్కరిస్తూ కాలక్షేపం చేస్తున్నారు. నవరసభరితమైన ఈ సంకీర్ణ సమయంలో వికృతంగా కొన్ని సమస్యలు తలెత్తి దిగ్భ్రాంతి కలిగిస్తాయి. చేనేత పనివాళ్లు పనిలేక, తిండిలేక ఎలకల్లా మాడిపోతారు. కొండపల్లి బొమ్మలు ఎవరికీ అక్కరలేకుండా పోతాయి; ఏటికొప్పాక లక్కసామాను చేసే కళాకారుడికి రంగులు దొరకవు; ముడివస్తువులు దొరకవు; ఒకవేళ దొరికి కష్టపడి సరకు తయారుచేసినా వాటిని ఆదరించి కొనే నాధుడు లేడు. ప్లాస్టిక్ బొమ్మల పోటీకి తట్టుకోలేడు. విదేశాల కళాశీలుల్నిసైతం ముగ్ధుల్ని చేసిన పర్లాకిమిడి కొమ్ము వస్తువులు-కళాఖండాలు ఆంధ్రదేశంలోనే చాలామందికి తెలియవు. మన కుటీర పరిశ్రమలూ, కుటీర కళలూ ఇంతటి దివ్యమైన స్థితిలో ఉన్నాయి.

మన జాతీయ నాయకులు, సాంస్కృతిక నాయకులు వీళ్ళు కళ్లున్నా చూడలేని స్థితిలో ఉన్నారు. కంటియెదుట వాస్తవికత వారికి తాము చూడదలుచుకున్న రూపంలోనే కనిపిస్తుంది. ఇవాళటి మన రాజకీయ సంరంభాలు, ప్రవర్తనలు, ఆర్థిక ప్రణాళికలు-వీటిని అనుసరించే రేపటి మన జాతీయ సంస్కృతి రూపొందుతుంది. డాలర్ల ఆర్జనకోసం వాణిజ్య పంటలు ప్రోత్సహిస్తే ఆంధ్రదేశం అంతా సస్యశ్యామలంకాక ధూమ పత్ర శ్యామలం అవుతున్నది. పారిశ్రామిక అభివృద్ధి పేరిట ప్లాస్టిక్ సామాను ఉత్పత్తి పెరిగిపోతున్నది; ప్రభుత్వానికి డాలర్లు కావాలి; వ్యాపారపు పంటలమీద అదనపు పన్నుల ఆదాయం సేల్సు

టాకున్నా, అన్నీ కావాలి. బట్టల మిల్లు యజమానుల దయావర్షం కావాలి. యీ ప్రవాహంలో పడి కుటీరపరిశ్రమలు, కళలూ నశిస్తుంటే, వాటిని ఉద్ధరించడం కోసం సభలూ, సమావేశాలు, పత్రికాశికలు, యివన్నీ ఆర్భాటంతో ఏర్పాటవు తాయి. దేనికదే విజయవంతం; ఎవరికి వారే యమునాతీరే.

విప్లవం' మొదట మానవుడి మెదడులో ప్రారంభిస్తుందంటారు భావుకులు: అలాగే జాతీయ సంస్కృతికి దోహదం మొదట మానవుడి హృదయంలో ఉద యిస్తుంది. ఆ అంకురానికి బాహ్య పరిస్థితులు, ఆర్థిక, రాజకీయ కారణాలు తోడ్పడతాయి. జాతీయతపట్లా, జాతీయ సంస్కృతిపట్లా, సమాజాన్ని నడిపే పెద్దలకే సరైన భావాలు లేనపుడు, ప్రజానీకం అడ్డదారిపట్టడంలో ఆశ్చర్యంలేదు. ప్రజాజీవనానికి, జాతీయ సంస్కృతికీ దూరంగా ఉండిపోయిన మనమేధావులూ, రాజకీయవేత్తలూ, కళోద్ధారకులూ, యీ సమస్యను పరిష్కరించలేరు. యంత్రో త్పత్తికీ కుటీర పరిశ్రమకీ సమన్వయం ఏ రీతిలో ఉండాలో తెలియని వీరు లోగడ ప్రకాశంగారి టెక్స్టయిల్ విధానాన్ని వ్యతిరేకించి ఆయనను పదవీ భ్రష్టుల్ని చేసేవరకు విశ్రమించలేదు. ఇపుడు ఆ పెద్దలే చేనేత సప్తాహాలు చేస్తున్నారు, చేనేత పరిశ్రమ. కుటీర పరిశ్రమలు, వీటికి ఆదరణ లభించా లంటే యీ సాంస్కృతికంగా ప్రజలలో జాతీయతపట్ల గౌరవం పెంపొంది, అభి రుచులు సంస్కరించబడాలి, అటు పరిశ్రమలకి ప్రభుత్వం నుండి ఆర్థిక సహా యం లభించి, ఉత్పత్తి పరికరాలు కొంత ఆధునీకం కావాలి. అన్నింటినీమించి, ఉత్పత్తి అయిన సరకు మార్కెట్ అవడానికి అవకాశం ఉండాలి. అంతేగాని సప్తాహాల వల్ల సమస్యలు పరిష్కారం కావు.

—తెలుగు స్వతంత్ర
మార్చి 12, 1954

స్తబ్ధంగా ఉన్న తెలుగు సాహిత్య వాతావరణంలో యీ మధ్య కొంచెం చలనం కలుగుతున్నట్లు అనిపిస్తున్నది. దీర్ఘకాలం పరధ్యానంగా ఉండిపోయిన సాహిత్యలోకపు అతిరథులూ, మహారథులూ అకస్మాత్తుగా ఒకరినొకరు పలుకరించుకుంటూ "....ఇందాక ఏమిటన్నావు? అనేశావుగాని ప్రమాణాలు చూపగలవా?" అని ప్రశ్నించుకుంటున్నారు. విషయం ఏమిటన్నది అంత ప్రధానం గాదు. అప్రస్తుతాలమీద ఘాటైన చర్చలు జరిగిన తర్వాతనైనా ప్రస్తుతాంశాల ప్రసక్తి రాకపోతుందా అని నాబోటి ప్రేక్షకుడి ఆశ. ఒకవేళ ఈ మహనీయులు అలా అప్రస్తుతాలతోనే అనంతయుద్ధం చేసుకుంటూపోయినా, యుద్ధంరేపిన 'సాహితీధూళి' తక్కిన యోధాన యోధుల ముక్కుపుటాలలో ప్రవేశించి కనీసం రెండు తుమ్ములైనా తెప్పించదా అని. అత్యవసరంగా కావలసింది స్తబ్ధత తొలగడం. దానికోసం శ్రీనాథుడికి సీసపద్యాలు రాయడం రాదని ఋజువయినా ఫరవాలేదు; నన్నయ్యకు అలంకార శాస్త్రం రాదని తేలిపోయినా అంత ప్రమాదంలేదు—ఆ విధంగానైనా ఉన్న నలుగురు అక్షరాస్యుల లోనూ కాస్త భారతంమీదా, శ్రీనాథుడి కావ్యాలమీదా కుతూహలం కలిగి, వాటిలో ఏముందో కొంచెం పేజీలు తిప్పిచూద్దామనే కోరిక కలిగిస్తే!

కాని....కాని....అలా జరుగుతుందనుకోవడం అత్యాశ. రేగిన దుమారం ఎవరో నలుగురు పండితులూ, యింకో నలుగురు పండితకవులూ—వారిమధ్యనే పరిమితమై ఉంటుంది. పైవారికి ఆ తరనభరన అంతా అయోమయంగా ఉంటుంది. సామాన్యుల నెత్తిమీదనుండి ఆకాశమార్గాన ఎగిరిపోతుంది. అంటే, ఎంత సంక్లిష్టమైన సాహిత్య చర్చ అయినా, ప్రతి వీధి మనిషికీ తేటతెల్లంగా తెలిసేరీతిలో జరగాలని కాదు; ఏ వైజ్ఞానిక చర్చా అలా జరగనేరదు కూడా; కాని సమకాలిక సాహితీ జగత్తుకి సైతం నిమిత్తంలేని విధంగా సాహిత్యం పేరు చెప్పితేనే సాధారణుడికి హడలుపుట్టేటట్లు జరిగితే, ఏ ప్రయోజనాన్ని సాధించినట్లు? అలాగంటే పండిత ప్రకాండులు "సాహిత్యం ప్రతి తుమ్మాయికీ జగ్గాయికీ కాదు" అని ఆగ్రహిస్తారు. నాకు తెలుసు. నా ఉద్దేశం వారికి బోధపడదు; వారితత్వం నాకు కొరుకుడుపడదు; ఒకరినొకరం ఇలా కోరచూపులు చూసుకుంటూ రోజులు గడపవలసిందే. యీ లోపుగా కావ్యాల (Classics] పఠనాసక్తి క్రమంగా క్షీణించిపోతున్నది; చదువుకోవడంమీద ఆసక్తి ఉన్నవారు వర్తమానంలో కొల్లలుగా లభించే పత్రికలూ, తేలిక రచనలూ, "పొగబండి సారస్వతా"నికి చెందిన నవలా నవలికా, నాటకం నాటికా, కథా కథానికా చదువుకుంటూ కాలక్షేపం చేస్తారు; లేదా పరాయి భాషలలోని సాహిత్యాన్ని ఆదరిస్తారు. (మళ్లీ యిక్కడ పరాయి సాహిత్యం ఆదరించ

కూడదనే అభిప్రాయంలేదు; అసలు సాహిత్యానికి దేశ, కాల, అవధులులేవు: యిక్కడ నేను విన్నవిస్తున్న అంశం వేరు.)

యీ పరిణామంయొక్క ఫలితం ఏమంటే జాతీయ జీవనంలో సాహిత్యానికి చోటులేకుండాపోవడం; ఉంటే కావ్యసాహిత్యంమీద మూఢభక్తి; వాటిని పూజిస్తేచాలు; చదువనక్కరలేదనే ధోరణి; లేదా అదంతా అనాగరికమయిన వట్టిచెత్త అనీ, శృంగారం, బూతు తప్ప యింకేమీలేదనీ తూష్ణింభావం. ''తెలుగులో సాహిత్యం ఏమిటండీ వల్లకాడు! మన సారస్వతం అంతా కలిసి ఒక ట్రంకుపెట్టెడు ఉండదూ!''—అనేది కొందరు పరీ సంస్కారవంతుల ధోరణి. అంచేతే, కనీసం యీ ఇరవైయోశతాబ్దంలో మన అసుంగు తెనుంగు దేశంలో ఎవరో గురజాడ, వీరేశలింగం, తిరుపతి వెంకటకవులు వంటివారిని మినహాయిస్తే జాతీయ జీవనంలో, సామాజిక రంగంలో **(Public Life)** కవులకీ, రచయితలకీ చెప్పుకోదగిన స్థానం లేకుండా పోయింది. మొన్న మొన్నటివరకూ బానిసలం కాబట్టి-సామాజిక రంగం అంటే ఒక్క రాజకీయాలు తప్ప యింకేటీ కాదు! స్వాతంత్ర్యం పరిస్థితి ఆలాగే ఉంది. రాజకీయ సంరంభానికున్న ప్రాధాన్యం యింక వేటికీలేదు; క్రమవికాసం చెందిన తక్కిన ప్రజాస్వామ్య దేశాల్లో రాజకీయాలు సామాజిక రంగంలో ఒక భాగం మాత్రమే. జాతీయ జీవనంలో దేని ప్రాముఖ్యం దానికుంది: (ఇంగ్లండులో కవిగా ఇలియట్‌కీ, శిల్పిగా జాకబ్ ఎప్‌స్టీన్‌కీ, రచయితగా ప్రీస్ట్లీకీ, నటుడుగా జాన్ గిల్‌గుడ్‌కీ, సామాజిక రంగంలో రాజకీయవేత్తలు యీడెన్, బెవాన్‌లకున్న స్థానంకంటె తక్కువ స్థానంలేదు. ఆయా రంగాలలో జరిగే కృషీ, సంఘటనలూ—ఆటీ రాజకీయాలకున్నంత ప్రాముఖ్యంతోనూ వార్తాపత్రికలలో ప్రచురితం అవుతాయి.) ఇక్కడ మన దేశంలో శుష్కరాజకీయాలే సమస్తమూ! సాహిత్య పరిషత్తు అధ్యక్షోపన్యాసంకంటె వార్తా పత్రికలకు జిల్లా బోర్డు సమావేశం జీవన్మరణ సమస్య; చిత్రకళా ప్రదర్శనంకంటె పశుప్రదర్శనంలో, చతురశ్ర సంయోగానికి అంతగా నోచుకోని మంత్రిగారి ఉపన్యాసం ముఖ్యాతిముఖ్యం. మన జాతీయ జీవనంలో విలువలు యింత తల్లకిందులుగా ఉన్నాయి.

చారిత్రాత్మకమైన అనేక కారణాలటుంచి, యీ శతాబ్దం తొలిసుండీ (కొందరు మహనీయుల్ని ఎప్పుడూ మినహాయించవలసి ఉంటుంది) మన పండితులూ, 'పండిత'కవులూ అవలంబించిన ధోరణి యీ పరిస్థితికి ముఖ్య కారణం. మన సాహిత్యంలోని కళాసౌందర్యం (వున్నంతవరకూ) వీలయినంత వరకూ అందరికీ సుబోధకంచేసి కావ్యసాహిత్యంపట్ల పఠనాసక్తి విస్తరింప చెయ్యడానికి బదులు మరింత దూరంచేసేశారు. కావ్యసాహిత్యం అంటే ఆదేదో

మహారణ్యాకీకారణ్యమనీ, తర్క, మీమాంస, వ్యాకరణ, అలంకారాదిశాస్త్రాయుధాలతో పండితవీరులు తప్ప దానిలో ప్రవేశించలేరనీ భయపెట్టారు. అవునుకబోలుననుకుని సాధారణులు సాహిత్యాన్ని పండితులకే వదిలేసి దూరంగా పోయారు. ఇంచుమించు ప్రతి కళారంగంలోను యిదే పరిణామం కలిగేసరికి, సామాజిక రంగంలో రాజకీయవేత్త స్వైరవిహారం సాగించాడు; శక్తి స వారికక్కడ చోటులేకుండా చేశాడు; నోరుకూడా లేకుండా చేశాడు. అంచేత అతగాడే ఏ శాస్త్రం ఏ రీతిలో ఉండాలో అన్నీ ఆజ్ఞాపిస్తాడు.

అటువంటప్పుడు సాహితీవేత్తల కర్తవ్యం ఏమిటి? జాతీయ జీవనం సమగ్రంగా వికసించాలంటే, స్కూళ్ళలో, కాలేజీలలో, విశ్వవిద్యాలయాల్లో తెలుగు సాహిత్యంపట్ల ఆసక్తి ఇతోధికం చేసి, అభిరుచి పెంపొందింప చెయ్యడం. అది జరగాలంటే మన సాహితీవేత్తలలో కొంత సహృదయతా, విశాల దృక్పథం, వైజ్ఞానిక దృష్టి అవసరం. స్వీయపాండితీ ప్రకర్షకంటే, సాహిత్యంపట్ల అభిరుచి కలిగించడం ఎక్కువ ముఖ్యం అనుకోవాలి. ఇతర సాహిత్యాలలో ఎట్టి కృషి జరుగుతున్నదో పోల్చుకోగలగాలి. మన పెద్దలు ఇటువంటి కృషి ఏదీ చెయ్యకపోగా, తీసుకోవలసిన కొన్ని ప్రాథమిక చర్యలు కూడా తీసుకోలేదు; ఇంతమంది ఉద్దండ పండితులు మహాయుద్ధాలు చేశారుగాని యింత వరకూ ఏ ఒక్క కరుణామయుడూ ఒక్క తెలుగు సాహిత్య చరిత్రనైనా మనకి ప్రసాదించలేకపోయాడు. చెప్పుకోదగ్గ ఒక్క తెలుగు నిఘంటువు లేదు; కావ్య సాహిత్యంలోని విశిష్ట భాగాలతో ఒక్క 'అంథాలజీ' రాలేదు; అభిరుచి ఏ కొంచెమో ఉండి, చదువుదామని ఆసక్తి వున్నవారికైనా కనీసం సూచికగా ఫలానా క్రమంలో ఫలానా పుస్తకాలు చదువుతే తెలుగు సాహిత్యం కొంతలో కొంత అవగతం అవుతుందని తెలిపే గైడ్‌వంటిదీ ఏదీలేదు. నన్నయ అఖండయతి పాటించాడా లేదా; ఆయనకి అలంకారశాస్త్రం వచ్చునా రాదా, గునగుసీసాలు మంచివా కావా — ఎన్నేళ్లు గడిచినా యివే మన విమర్శకుల సమస్యల్లు. వీటిమీదే యుద్ధాలు. మళ్లీ యింకొక చెంప మన యువకలోకానికి పూర్వ సాహిత్యంపట్ల ఆదరణలేదని 'నిస్పృహ.' వీని బాసపేరు అన్నట్లు—వీరి పోకడ వేరు. ఇలా ఎన్నాళ్ళు సాగుతుందోమరి!

మార్చి 19, 1954

-)o(-

మూడో తరగతి రైలుపెట్టె. అందులో క్రిక్కిరిసిన జనం. మూల బెంచీమీద యిరుక్కుని, కూర్చొన్నదొక వృద్ధవితంతువు. బండిలో ఆమె చుట్టూ కూర్చున్న అందరూ, చుట్టలు, సిగరెట్లూ, బీడీలూ వెలిగించి ధూమపానం చేస్తున్నారు. కమ్ముకున్న పొగకి ఉక్కిరిబిక్కిరై బాధపడుతోంది ముసలమ్మ. తన ఎదురుగా కూర్చున్న పన్నెండేళ్ళ కుర్రాణ్ణి చూసి. "ఈ పెట్టె అంతటోకీ పొగతాగనివాడివి నువ్వొక్కడివే కనబడుతునావు నాయనా!" అంది. కుర్రవాడు గంభీరంగా మొహంపెట్టి మందహాసం చేసి, "మరేనండి బామ్మగారూ! నా చిన్నపుడు వెధవచుట్టలు పందలకొద్దీ తెగ కాల్చి కాల్చి—యిప్పుడు అలవాటు మానుకున్నాను విసుగెత్తి" అన్నాడు.

ఆ కుర్రవాడి ఆత్మవిశ్వాసానికి పక్కనున్న పెద్దమనుషులంతా విస్తుపోయారు. పోతే పోయారుగాని, అలాంటి "బాల నెపోలియన్లు" రాను రాను మన సంఘంలో ఎక్కువగా ఉత్పత్తి అవుతున్నారు. అది నిజంగా మన కందరికీ 'గర్వ' కారణం. "అచట బుట్టిన చిగురు కొమ్మైన చేవ" అన్నాడు ఆంధ్రకవితా పితామహుడు. ఇవాళ ఆంధ్ర దేశమంతా ఒక పెద్ద అరుణాస్పదం. అక్కడి తరుణ రచయిత ఒకడు ఈ మధ్య ప్రచురించిన పుస్తకం ఒకటి కంటబడే భాగ్యం కలిగి నాకెంతో జ్ఞానోదయం అయ్యింది. దానితోపాటు క్షీర సాగరంవంటి హృదయం ఆనందంతో ఉప్పొంగింది. పుస్తకంలో రచయితను పరిచయంచేస్తూ, వ్రాసిన వాక్యాలు;

"శ్రీ సామాన్య మధ్యతరగతి కుటుంబమునందు 1930లో జన్మించారు. వీరి బాల్యంలో వీరికి విద్యగరపడం అంటే ఉపాధ్యాయులకు తలప్రాణం తోకకు వచ్చేది. . .1939లో శ్రీ ఎం. ఎన్. రాయ్‌ని రచయిత కలుసుకోవడం సంభవించింది. అంతే. ఆనాటినుండి రాయ్ బాటలో గమనం సాగిస్తున్నారు..."

అంటే అప్పటికీ, యీ ఉద్దండ బాలుడి వయస్సు తొమ్మిదేళ్లు. ఆ వయస్సులోనే అతన్ని రాయ్ సిద్ధాంతాలు ఆకర్షించాయంటే, యింకా ప్రహ్లాద చరిత్ర చప్పబడిపోక ఏంచేస్తుంది? ఈ తరుణ రచయిత సృష్టించిన నాటక రాజానికి ఒక శతావధాని, ఒక కవిసమ్రాట్, ఒక గ్రాడ్యుయేటు యువతి—వీరంతా పరిచయవాక్యాలు పలికారు. నాటకంలోని కథావస్తువు "కామము—ప్రేమ" వీటి తారతమ్యమట. ఇక మన వర్థమాన సాహిత్యానికి కావలసింది ఏమున్నది? అది నిస్సంశయంగా నిత్యపల్లవశీలము. శాకుంతలం మన స్మృతిపథంలోనుండి చెరిపేసుకున్నా ముందుతరాల వారికేమీ లోటుండదు.

ఈ ప్రచారయుగంలో "పబ్లిసిటీ" అనే వ్యామోహవు సన్నిగూఢమైన ఆకర్షణ యువతీయువకులలో, బాలబాలికల్లో వికిరాతి వికారమైన మనస్తత్వాల్ని ప్రోత్సహిస్తున్నది. అప్పుడే జనించిన శిశువుకిసైతం ప్రచారం కావాలి. తన జనన వృత్తాంతం పతాక శీర్షికలతో పత్రికల్లో అచ్చుపడాలి. బాల బాలికలకి, యిల్లు దిద్దుకునే యిల్లాలికి, నిరుద్యోగి యువకుడికి—పురాణం శాస్త్రులకి అందరికీ పబ్లిసిటీ లేకపోతే జీవితం వెలితిగా తోస్తున్నది. దేనికి పబ్లిసిటీ? ఏపరమార్థం సాధించినందుకు? అంటే మరేంలేదు—ఊరికే బతికే ఊపిరి పీలుస్తున్నారా? లేదా? నిత్యనైమిత్తిక కర్మలు యథావిధిగా ఆచరిస్తున్నారా లేదా? అందుకే పబ్లిసిటీ. ఇంకొంచెం తమరు చిత్తగిస్తే పదేళ్ళ కుర్రాడు బొమ్మ గీస్తాడు. ఎనిమిదేళ్ళ చిన్నది భరతనాట్యంచేస్తుంది. అవి లోకవార్తలని వాళ్ళ తల్లిదండ్రుల అభిప్రాయం. ఆ ఘనకార్యాలకి ప్రచారం లేకపోతే ఎలా? అలాగే ఏ పాచిపెంట గ్రామంలోనో, తొస్సిపూడి గ్రామంలోనో జరిగిన "డిబేటింగు" సభలో ఒక చిరుత అఖండుడు అందరినీ చిత్తుగా ఓడించేసి "వెండికప్పు" బహుమానం పొందాడు. ఇక ఆ మహద్విషయానికి సంబంధించినవారంతా ఆ వార్త పి.టి.ఐ—రాయిటర్ వార్తాసంస్థ అందుకుని "నేల నాలుగు చెరగులకీ" అందించాలని తీర్మానిస్తారు.

ప్రజానీకంలో యింత భారీ యెత్తున ఒకానొక ఉత్కంఠ పెరుగుతూ వస్తుంటే దానికి సంతృప్తి కలిగించే విధానాలు మొలకలెత్తకపోవడం ప్రకృతి విరుద్ధం. ఈ ప్రచార వాంఛాదగ్ధ హృదయాలకి అభయహస్తం ఇస్తూ — "యిష్టవాంఛా ఫల సిద్ధిరస్తు" అని దీవించి సంభావనా పుచ్చుకునే గడుసు వాళ్ళు తయారయినారు. తయారయి ఉభయతారకమైన తరుణోపాయాన్ని ఏర్పాటు చేశారు—పత్రికలలో, రేడియోలో, సినిమాలలో ఇందులో రేడియో అనేది సర్కారీవారి ఇలాకాలో ఉన్నదిగనక—చిట్టిచిట్టి చెల్లాయిలు పుట్టినతేదీలు వగైరా తప్ప తక్కిన ప్రచారాలకి యింకా మొహమాటపడుతోంది. పత్రికలకీ సినిమాలకీ, ఆ మొహమాటాలులేవు. సినీమాల్లో బాలతారలు సంఘానికి ముద్దుబిడ్డలు. కథ మొదట్లో వీళ్ళు నాయికా నాయకుల బాల్యం నటించి చూపుతారు. అంత బాల్యంలోనే వీళ్ళ ప్రేమ అంత ముదురుపాకాన ఎలాపడింది అని మనం మూర్ఛపోయినా వాళ్ళకి లెక్కలేదు. బాల కథా నాయికకి కిలకించిత ధ్వనితో నవ్వడం తెలుసు; బాల నాయకుడు విరహతాపం నటించి చూపుతాడు. మనం ధన్యోస్మి అని సంతోషిస్తాం. ఫిల్ము విడుదల అయ్యాక ఏ తొండంగి గ్రామంలోనో యీ బాల జంటకి "అఖండమైన" సన్మానం జరుగుతుంది. పసి పత్రికలు ఈ కార్యకలాపాలు ఛాయాచిత్రాలతో సహా ప్రకటిస్తాయి. ఈ రకం బాల నటుడు ఒకడు నాకు చాలా కాలంనుండి స్నేహితుడు. వయస్సు పది

సంవత్సరానికి లోపు. ఏడోక్లాసు చదువుతున్నాడుగాని, చాలా చిత్రాల్లో నటించాడు. పెద్దమనిషివలె డ్రెస్సు వేసుకొని, నాబోటి సామాన్యుడు ఎదురైతే "ఏమండీ నమస్కారం! కులాసాగా ఉన్నారా?" అంటాడు. ఇంకా పదేళ్ళు నిండని ఈ కుర్రాడు అప్పుడే జీవితాన్ని కాచి వడబోసి, అనుభవాల మధ్య పండిపోయినట్లు కనబడుతాడు, ప్రవర్తిస్తాడు. మానసికంగా నలభై యేళ్ళ అనుభవశాలి. ఈ కుర్రాడి జీవిత ప్రయాణం ఇంకా ప్రారంభం కాలేదు—కాని—ఏ ఘట్టంలో ఏ అనుభూతి ఎలా ఉంటుందో తెలుసు. ఇంతగా మెలికలు తిరిగిపోయిన ఆ కుర్రవాడి వ్యక్తిత్వానికి తల్లిదండ్రులు మురిసిపోయి ఎంతగా ఆనందిస్తున్నారో కాని, పిందెను ఊదరగొట్టి అకాలంలో పండుగా మార్చేశారు.

ఈ ప్రచారాన్వేషణ ఒక భారీ పరిశ్రమగా సజావుగా సాగిపోతూ ఉంది. దాన్ని ప్రోత్సహించడం కొందరికి లాభసాటి బేరం; "అన్నం వండడం ఎలాగ?" అని పత్రిక ద్వారా లోకాన్ని ప్రశ్నిస్తోందొక నూతన వధువు. దానికి పత్రిక సమాధానం యిస్తుంది, వంటచెరుకు ఎంత కెంపరేచరులో మండాలో వివరిస్తూ. ఇల్లు తడుస్తున్నపుడు చీపురుకట్ట ఎడంచేత్తో పట్టుకోవాలో కుడిచేత్తో పట్టుకోవాలో తెలియక, పత్రిక ద్వారా సందేహనివృత్తి చేసుకుంటుందొక ఇల్లాలు. ఈ పరిణామాన్ని ఏనాడో గ్రహించిన చలంగారి సౌరిస్ లోగడ "నేటి యువతీయువకులకు మూడే మూడు పరమోత్కంఠలు: పత్రికలలో ఒకసారి తమ పేరు అచ్చవాలి; రేడియోలో తమ కంఠం వినిపించాలి; సినీమా తెరమీద తమ ముఖం ఒకసారి కనిపించాలి" అన్నది. దానికీ సంతృప్తిరాని బుద్ధిమంతులు—గురి తేడా కూడా తెలియకపోయినా, క్షణమాత్రాన మహాకావ్యాలు రాసి అచ్చువేస్తారు—రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కుల ధర్మమా అని. పసితనం యింతగా వెల్లువికి దేశంలో ప్రవహిస్తుంటే, అది పసిడికాలం అని అందరం భ్రమించి ఆనందిస్తున్నాం.

—)o(—

—తెలుగు స్వతంత్ర
(ఫిబ్రవరి 12, 1954)

క్రళకళలాడే బజారులూ, ఉత్సాహవంతులైన జనం, నదిరోడ్డుమీద యోగక్షే మాలు, రాజకీయాల అరంటు చర్చలు, సమృద్ధిగా ఉండి అడుగుపెడితే అహ్వా నించే కాఫీహోటళ్ళు, ట్రాఫిక్ నిబంధనలను పూర్తిగా తుడిచిపెట్టే రకరకాల వాహనాలు—ఆంధ్రాలో కోస్తాజిల్లాల పట్టణాలు నవనవోన్మేషంగానే ఉన్నాయి. పెసరట్టు రుచిలో పెద్ద మార్పేమీలేదు. అవే ఎండాకాలాలు, పోగా ''కూల్ డ్రింక్'' శాలలు మాత్రం సంఖ్యలో విపరీతంగా పెరిగిపోతున్నాయి, రంగు రంగులతో మెరిసిపోతున్నాయి. వాటిగోడల అద్దాలలో ప్రతిఫలించే అనంత దరహాసాలు, ఖరీదైన ద్రాక్షపానీయాల నిరంతరాస్వాదనలు—ఎండవేడిమి ఓడిపో యింది. అది బందరో లేక గుడివాడో—కాక గుంటూరో, విజయవాడో పటణం ఏదైతేనేం, నేటి యాత్రికుడికి అన్నీ ఒక్కలాగే గోచరిస్తూ ఆంధ్ర సంస్కృతి వెల్లివిరిస్తూ, ఇక్కడ జనం మహాచైతన్యవంతులు సుమీ అని చెంపపెట్టు పెట్టి నట్టు రుజువుచేస్తున్నాయి. బాహ్యదృష్టికి అంతా 'ధనధాన్య సమృద్ధిగా' ఉంది. రెండు మూడు పంచవర్ష ప్రణాళికలూ కోస్తాజిల్లాలపుడే పూరిచేశాయేమోననే అనుమానం విదేశీ యాత్రికులకు క్షణమాత్రం కలిగిందంటే క్షమార్హమే మరి. ఇన్ని పానీయఫలాహారశాలలు, ఇన్ని గాజులదుకాణాలు, ఇన్ని సిల్కుబట్టలశాలలు, ఇన్ని సినీమాథియేటర్లు—జీవనప్రమాణం ఎంతగా పెరిగిందనిపిస్తుంది. వ్యాపారం ఎంతగా అభివృద్ధి చెందిందనిపిస్తుంది. కోస్తా ఆంధ్ర అంటే ఒక్క పట్టణాలు మాత్రమే అయితే—సర్వమూ నవరత్నఖచితంగా ఉంది. క్రిక్కిరిసిన సినీమా హాలులోచోటు దొరకడం కష్టం, కిల్లీకొట్టులలో రేడియోలు—వాటి 'పికప్'ల లోంచి 'ఏరువాక సాగాలోయ్' అంటూ నిరంతరగానం—అది నిస్సందేహంగా చీకూ చింతలు లేని సీమ.

అందుకే బస్సు డ్రైవర్లను చూస్తే ప్యాసింజర్లకంతభయం, కండక్టర్లను చూస్తేఅంత హడల్. అందులోనూ మొన్ననే ప్రజాస్వామ్యం ఆంధ్రలోపిలిచింది. కాబట్టి 'ఓవరు లోడింగు' జరిగినా ఫ్రంటు సీటులో పోలీసు సబిన్స్పెక్టరంతగా పటించుకోడు: 'పొగ త్రాగరాదు' అన్న నిబంధన ఎదురుగా చెక్కి ఉన్నా డ్రైవరు సిగరెట్టు కాల్చుకునేందుకు అడ్డురాదు. పట్టణంలోని పార్కులు బిచ్చ గాళ్ళ వంటశాలలుగా మార్చేసినా అది ప్రజాస్వామ్యంలో భాగమే గనక ఫరవా లేదు. అతిక్రమించడానికి కాకపోతే నిబంధనల ప్రయోజనం దేనికి? ఫరవా లేదు, అంతా సజావుగానే వుంది అని నా హృదయం ఆనందంతో కెవ్వు మంది. ఆ మాటకొస్తే వెనకటికంటే నేడే ఎక్కువ సజావుగా ఉంది. వినోదం, విజ్ఞానం, ప్రజాస్వామ్యం—మూడూ ముప్పేట జడలాగా నిత్యజీవనవాహినిలో అంతర్లీనంగా మెలికలు తిరిగిపోతున్నాయి. మంత్రుల సంఖ్యకీ కొదవలేదు గనక వారి పర్యటనలకీ కొదవలేదు, పక్షం తిరిగే సరికి ఎవరో ఒక మంత్రి

ప్రత్యక్షంగాని కోస్తాపట్టణం ఉండదు. అప్పుడు స్థానిక కాంగ్రెసు భవనాలు కళకళలాడతాయి, రహదారి బంగళా ఆవరణలో నిలిచే సరికొత్త కార్లకు అంతులేదు. ఆ సమయంలో పోలీసు హడావిడికీ అంతే, అప్పటికప్పుడు ట్రాఫిక్ నిబంధనలు ఆకస్మాత్తుగా అమలులోకి వస్తాయి. కాని ప్రజాస్వామ్యంతోపాటు రోడ్లు అంతగా అభివృద్ధి చెందలేదుగనక మంత్రిగారికి దారి ఇవ్వడంకోసం కొన్ని తాత్కాలికపు ఏర్పాట్లు చేయాలి. అది ప్రజలకు యిబ్బందికరంగా ఉంటుందా? ఏంచేస్తాం మరి-ఉన్నపాటున రహదారులు బాగుపడాలంటే కష్టం. ఎన్నో సమస్యలతో సతమతమవుతున్న స్థానిక సంస్థలకి యీ రోడ్ల గొడవా ఇప్పుడు ముఖ్యం? పదవులు నిలబెట్టుకోవాలి, మంత్రులతో మంతనాలు జరపాలి, రానున్న కమిటీ ఎన్నికల గురించి ఆలోచించాలి-స్థానిక పెత్తందార్లకు ఊపిరి తియ్యడానికి వ్యవధి చాలడంలేదు. అందుచేత రోడ్లు, రహదార్లు, మంచినీటి సమస్యలాంటి మైనర్ గొడవలు ప్రజలకి కొంచెం యిబ్బందిగాఉన్నా సద్దుకుపోవాలి. అభివృద్ధి సాధించిన అనేక యితర రంగాలు చూడండి కావలిస్తే-ఎంత శీఘ్రగతిలో ఎంతగా మార్పులు జరుగుతున్నాయో?

అవీ అంగీకరించాలి. చాలాకాలం తర్వాత నేడు ఈ ప్రాంతంలో అడుగుపెట్టిన యాత్రికుడికి-కనబడే కళ్ళు మిరిమిట్లు గొలుపుతుంది. అభివృద్ధిప్రతి పట్టణమూఅపారంగా పెరిగిపోయింది. కొత్త యిళ్ళు, భవనాలు, అన్నీ నవీన పద్ధతుల్లో పరికరాలతో ఏర్పడినవే. చాలా గ్రామాలకు ఎలక్ట్రిసిటీ అందుబాటులోకి వచ్చింది. బస్సురూట్లు కొత్తవి ఏర్పడ్డాయి. రాకపోకలు, వ్యాపారం పెరిగాయి. ప్రస్తుతపు సామాజికజీవనంలో ఏకైక వినోదం సినిమా కాబట్టి థియేటర్లు చాలా రెట్లు ఎక్కువయాయి. దామాషాలు, అంకెలూ అటుంచి స్థూలదృష్టికి గోచరించే పరిణామాలివి. సమాజంలో ఈ 'మొబిలిటీ' ఎప్పుడైతే హెచ్చిందో, అప్పుడే డబ్బు చలామణిసైతం ఎక్కువవుతుంది.దీనికితోడు వివిధ అభివృద్ధి రంగాలలో ప్రభుత్వకార్యకలాపాల సంరంభంకూడా ఎక్కువగానే ఉంది కనక ప్రభుత్వవర్గాలనూ,అధికారంలో ఉన్న పార్టీ వర్గాలనూ అంటిపెట్టుకున్నవారికి, యిది ఆట విడుపు సమయం. అందుచేత రాజకీయాలు వాళ్ళ ఆధీనంలోనే ఉంటాయి. స్థానిక అధికారం వాళ్ళ గుప్పిటలోనే ఉంటుంది. వీటన్నిటిలోంచి ఒక సంకీర్ణమైన, అనేక అంశాలలో పరస్పరవిరుద్ధమైన-ఒక పరిణామం విస్తరిల్లుతున్నది. సూక్ష్మరూపంలో దాన్ని పోల్చుకోవడమూ అంత సులభం కాదు, దాని అవధులు ఎక్కడికి దారితీస్తాయో అంచనా కట్టడమూ తేలిక కాదు. సామాజిక శాస్త్రజ్ఞులకిదియొక చక్కని పరిశోధక రంగం.

ఒక దృక్పథంలోంచిచూస్తే ప్రతి రంగంలోనూ అభివృద్ధి గోచరిస్తుంది; దుకాణాలనుండి హైస్కూళ్ళు కళాశాలలదాకా అన్నీ సంఖ్యలో అభివృద్ధి చెందాయి; పత్రికా పఠన తృష్ణ పెరిగింది; అలాగే రేడియో శ్రోతలసంఖ్య, బహిరంగ సభలు సమావేశాలు, సాంస్కృతిక మండలుల పుస్తక విక్రయశాలలు—ఎటుచూసినా సంఖ్యాభివృద్ధి ఎదురవుతుంది. కాని ఆ నిష్పత్తిలో కొత్త విలువల చైతన్యం మాత్రం కనబడదు. ఫర్లాంగుకి రెండు చొప్పున దేశ నాయకుల విగ్రహాలు మిమ్మల్ని పలకరిస్తాయి. చొక్కా లేకపోతే, అది గాంధీ విగ్రహం, మిలటరీ డ్రెస్సు ఉంటే, నేతాజీ, వేస్టు కాంగ్రెసు టోపీ—అయితే నెహ్రూ విగ్రహం ఉండడం ముఖ్యం: దిష్టి బొమ్మల్లాగా అవెంత అసహ్యాకరంగా ఉన్నా ఫర్వాలేదు. గ్రామాలలో హైస్కూలు ఉండడం ముఖ్యం. పరికరాలుగాని, ఉపాధ్యాయుల అర్హతలుగాని ఎవరికీ అక్కరలేదు. చదువుకోవడం కంటె కాపీ కొట్టయినా సరే, ఇంకా పసందైన పద్ధతులు అవలంభించినా సరే—పరీక్ష నెగడం ముఖ్యం. 'స్టాటరీ' కోసం చదువు. పెత్తందారీకోసం, ధనారసకోసం రాజకీయాలు. తత్ఫలితంగా ధనారసకున్న విలువ, డబ్బుకి ఉన్న శక్తి—యివాళ ఇంక దేనికీ లేవు. ఆంధ్రలో మొన్నటి ఎన్నికలలో గెలిచింది ప్రజాస్వామికమా, ధనస్వామికమా అని ప్రశ్నవేసుకుని పరిశోధన ప్రారంభిస్తే రంగు రంగుల సూక్ష్మ సత్యాలు బయటపడతాయి.

అర్థ శాస్త్రంలోని Graham's law పరిమిత సత్యాన్ని ఏకైక జీవన విధానంగా మన ఆంధ్రజాతి యివాళ అమితోత్సాహంతో అనుసరిస్తున్నది. దీనికి అమితంగా తోడ్పడుతున్నది రాజకీయ నాయకులు. వారి పోకడలను నడిపిస్తున్న శక్తులు అవకాశవాదం, ముఠాతత్వం, కులతత్వం, జీవనప్రమాణం హెచ్చుతున్నది, సిమెంటు ఖర్చు పెరిగిపోతున్నది, నగర వీధిలో సరికొత్త కారుల సంఖ్య నానాటికీ ఆనందకరంగా ఉంది, కొత్త ఎలక్ట్రిక్ లైనుల నిర్మాణం జోరుగా సాగిపోతోంది. ఇదంతా పురోగమనం కాదని ఎవరనగలరు? కాని నిజంగా పురోగమనమేనా? ఆత్మ పరీక్ష చేసుకోవలసిన సమయమిది. ముమ్మందు యీ ఆలాపనలో యథాశక్తి ఆ ప్రయత్నమే జరుగుతుంది.

oOo

జూన్, 3-1955.

"భ్రాత భవ్యభవద్భావ బోధ్యమైన
కాలమున కించుకయు మార్పు కలుగబోదు
గాని దాని గర్భంబులో గలసిపోవు
వివిధ పరిణామ సంతతుల్ వేనవేలు." (కవిద్వయం)

జూన్ పన్నెండవ తారీఖు రాత్రి పిఠాపురంలో శ్రీ వోలేటి పార్వతీశం గారు అస్తమించారు. వయస్సు డెబ్బై రెండేళ్ళు. ఈ విషాదవార్త ఆంధ్రదేశానికి తెలియడానికి కొద్దిరోజులు పట్టింది. ఒక్క ప్రముఖాంధ్ర దినపత్రిక మినహా-తక్కిన తెలుగు పత్రికలకు సైతం ఈ వార్త అంతగా ప్రాముఖ్యమైనది కాలేకపోయింది. సహజమే. అస్తమించిన మహాత్ముడు ప్రముఖ రాజకీయ నాయకుడు కాదు; సంపన్నుడంతకన్న కాదు. ఉన్నతాధికారీ కాదు. పత్రికలో పతాక శీర్షికలాయనకు లభించవు.

ఇవి తాత్కాలికపు విలువలు; కాని యింకో కాలపు విలువలున్నాయి: నేటి ప్రముఖ రాజకీయ నాయకులు జనుల స్మృతిపథంనుండి చెరిగిపోయినవేళ, నేటి సంపన్నులెవరో నాటికి అక్కరలేనివేళ, నేటి అధికారుల నామాక్షరాలు కాలగర్భంలో అదృశ్యమైనవేళ, అ వేళల్లో కూడ శ్రీ వోలేటి పార్వతీశంగారి పేరు అక్షరాస్యులైన తెనుగుజనులు కృతజ్ఞతతో తలుచుకుంటారు: ఆయన సృష్టించిన సాహితీ సంపదకు వారసులై-"ఎంత సంపన్నుడాయన!" అనుకుంటారు; కవితా హృదయాలపై అనురాగ పూర్వకమైన అధికారం నాటికీ కలిగి ఉంటారు. ఎందువల్లనంటే-కవుల పరంపరకు చెందిన శ్రీ వోలేటి పార్వతీశం గారు "కవిరాజహంస"; "కవికులాలంకరుడు"; కవిద్వయం శ్రీ వేంకటపార్వతీశ్వరులలో ఒకరు.

శాంత గంభీరమైన ముఖం, విశాలమైన ఫాలతలం, వెడదయైన పండు మీసాలు, మేఘ గరనంవంటి కంఠస్వరం-శ్రీ వోలేటి పార్వతీశంగారితో క్షణమాత్ర పరిచయం భాగ్యం ఉన్నవారికి ఆ అమృతమూర్తి విగ్రహం శాశ్వతంగా హృదయంలో హత్తుకపోతుంది. సింహగరనంవంటి వాక్కువెనక ఎంత ఆర్ద్రహృదయం ఉన్నది!-అనిపిస్తుంది. ఆయన అమాయకత్వం దాచినా దాగేది కాదు; అలాగే తళతళ మెరిసే ఆయన నేత్రాల వెనక ఉన్న మానవ ప్రేమ, కారుణ్య దృష్టి అణచిపెట్టుకున్నా అణిగిపోయేదికాదు. ఉత్తమమైన, హృదయంగమమైన కవితవింటే-ఆనందంతో ఆ కళ్ళు నీళ్ళు కార్చేవి; దుఃఖార్తుని కథ వింటే, పసిపిల్లకి దెబ్బతగిలితే-దాహంతో పక్షి అరుస్తే అంత పార్వతీశం గారు బేలవలె వెల వెల కన్నీరు కార్చేసేవారు; నిత్యజీవితంలోని ప్రతి

బాధామయ సంఘటనకీ ఆయన హృదయం చలించిపోయేది. ఆవేశము వచ్చినపుడు శ్రీ పార్వతీశంగారి కళ్లు "శ్రావణమేఘాలాగ" తడితడిగా ఉంటాయి. "కలుషహృదయాల, గర్వాల, కాంక్షితాల, నిత్యకోలాహలాగ్ని దగ్ధీకృతమైన" యీ సమకాలీన సమాజంలోనే పార్వతీశంగారు అలా జీవించారు. అందుకే సమృద్ధిగా ధనం ఆర్జించగలిగినా—శ్రీ వేంకట పార్వతీశ్వర కవులలో ఏ వొక్కరూ ఆర్థికంగా సంపన్నులు కాలేకపోయారు; అయితేనేం, కలిమిలో, లేమిలో—సుఖంలో, దుఃఖంలో—ప్రవాసంలో, పేరోలగంలో—ఆ కవిద్వయం సృష్టించిన సంపద రూపాయలది కాదు; అక్షరములది. అందుకే అది అక్షర సంపద ఐనది. ఆ సంపదలో సమాన భాగస్వాములైన శ్రీ పార్వతీశంగారు దేహయాత్ర చాలించినా—చరితార్థులై అమరమూర్తులైనారు. ఎనలేని సాహితీ సంపద అందించిన ఆ కవితా తపస్వి అస్తమించినాడన్న విషాద వార్తకు శోక భారంతో చలించని ఆంధ్ర హృదయం ఉండదు. జాతి రత్నాలొక్కటొక్కటే యిలా రాలిపోతున్నవి.

శ్రీ వేంకట పార్వతీశ్వరులనగానే—అర్ధశతాబ్దపు ఆంధ్ర సాహిత్య చరిత్ర స్మృతిపథం ముందు మెరియక తప్పదు. 1881వ సంవత్సరం జనవరి 2వ తేదీన జన్మించిన శ్రీ బాలాంత్రపు వెంకటరావుగారు, 1882 సంవత్సరం మే 23న జన్మించిన శ్రీ వోలేటి పార్వతీశ్వరంగారూ—"అన్నదమ్ములు కారు; అంతకన్నా దగిరవారు." తరుణ వయస్సులోనే వేర్వేరుగా కవితా సాధన చేస్తుండేవారు. ఆనాడు—అనగా సుమారు యాభై సంవత్సరాల క్రిందట, శ్రీ ఆచంట సాంఖ్యాయన శర్మగారు వెలువరిస్తుండే "కల్పలత" పత్రికలో—సమస్యా పూరణకు పద్యాలు పంపి బహుమతులు పొందడం ద్వారా—ఒకరినొకరు పోల్చుకున్నారు. ఈ యువ కవులను "వేంకట పార్వతీశ్వర" కవిద్వయంగా సాహితీ యాత్ర సాగించడానికి ప్రాతిపదిక వేసిన వారిలో ముఖ్యులు శ్రీ నడకుదుటి వీర్రాజుగారు. అంతే—ఆ శుభ క్షణాల నుండీ నేటి వరకూ ఉభయులకూ ఒకే కలం; ఒకే కంఠధ్వని; ఒకే కృషి; ఒకే అవధి. అనవరత కృషితో ఒక తరానికిపైగా ఆంధ్ర సాహిత్యాన్ని మాధుర్యోజ్జ్వలం చేశారు. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయం 1911లో స్థాపించి మొన్న మొన్నటి వరకూ ఆ ప్రచారిణీక ముద్రతో శతాధిక గ్రంథాలను వెలువరించారు. ఆంధ్ర ప్రచారిణీ ఉజ్వలంగా నడుస్తున్న కాలంలో ఆ గ్రంథమాల నవలలు కొద్దో గొప్పో లేని తెలుగు యిల్లు ఉండేది కాదు. "ప్రమదావనం", "వసుమతీ వసంతం" వంటి స్వతంత్ర నవలలూ, "గోరా", "విషవృక్షం", "కృష్ణకాంతుని మరణ శాసనం" వంటి అనువాద నవలలూ పుంఖాను పుంఖంగా అందించి పాఠకులను ఉర్రూతలూగించారు. ఆంధ్ర సాహిత్యానికి ఎటువంటి

బంగారు కాలం అది: ఆ నవలలు నిండైన కవితా ఖండాలు. వాడినవి గ్రాంథిక భాషే ఐనా, గ్రాంథికం ఎంత సరళంగా, హృదయంగమంగా, మాధుర్యంగా రూపొందించవచ్చునో అమోఘంగా నిరూపించగలారు శ్రీ వేంకట పార్వతీశ్వరులు. ఒక ప్రక్క నవలా సాహిత్యాన్ని యితోధికంగా సుసంపన్నం చేస్తూనే—యింకొక చెంప కవితలో కొత్త రీతులకు దరి తీశారు. వీరి షష్టిపూర్తి సన్మానం తర్వాత "కావ్యకుసుమావళి" ద్వితీయ ముద్రణం వెలువడింది. ఆ సంపుటికి "భూమిక" వ్రాస్తూ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారన్న మాటలు:

> "అసలు మనకు వెంకట పార్వతీశ యుగమని ఒకటున్నది. దాదాపు పాతికేళ్ళకు పూర్వం ఆంధ్ర లోకంలో వెంకట పార్వతీశ్వరుల ప్రభావం ఎంత అధికంగా ఉండేదో ఇప్పుడు గ్రహించడం కష్టం. ప్రభాత ప్రాంగణంవైపు దృష్టులు సారిస్తూ నూతన యుగానికి స్వాగతమిచ్చే ప్రతి కవికీ వీరి కావ్య జగత్తులో నుండి బంగారు పూతలు, పక్షుల కూతలూ—ముందుగా ఎదురయ్యేవి. అప్పుడు ఎందరో నవ కవులమీద వీరి పలుకుబడి ప్రసరించింది. నా గృహంలోనూ ఒక గవాక్షం తెరిచారు. దానిలో నుంచి పచ్చని తోటలూ, పైరు చేలూ దూర గగన ఖండాలూ అప్పుడు ఆశ్చర్య చకితుణ్ణై చూశాను."

ఆధునికాంధ్ర సాహిత్యానికి వైతాళికులెవరు—అనే జిజ్ఞాస కలిగేటప్పటికి నేటి వాఙ్మయ చరిత్రకారులకు నిష్పాక్షిక దృష్టి చెదరి అనేక ప్రలోభాలా వహిస్తున్నవి. సమగ్ర పరిశీలన అటుంచి, చారిత్రక పరిణామాలను శ్రద్ధగా ఆకళించుకుందామనే ఆసక్తి కూడా లేకుండా వాఙ్మయ చరిత్రలు రచిస్తున్నారు. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము వ్రాసి నిజనామాన్ని ప్రకటించే ధైర్యం కూడా లేని "కవిత్వవేది"కి వేంకట పార్వతీశ్వరుల ఏకాంత సేవ యొక్క కవితాత్మ అంతు చిక్కలేదు. "ఏకాంత సేవ" వల్ల తన్మయులై "వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమునకీ మహాకవుల భక్తుల ఏకాంత సేవ యట్టిదని నా యభిప్రాయము" అన్నారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. "నవ్యాంధ్ర సాహిత్య వీధుల్లో" విశృంఖలంగా మామా అల్లుళ్ళు నాలుగు సంపుటాలూ ప్రకటించారు: పరస్పరం స్తుతించుకోవడంలోనూ, అంగుష్ఠమాత్రులనూ ఆజానుబాహులనూ ఒకే శ్రేణిలో ఉంచే సత్ప్రయత్నంలోనూ నాలుగు సంపుటాల స్వంత పాక్షికత్వాలు అందించారు గాని—నవ్యాంధ్ర వాఙ్మయ చరిత్రను మాత్రం ఆకళించుకోలేకపోయారు. ఎవరి స్వీయకవితా సుషిరను వారు వినేవారి చెవులు బద్దలగునట్లు మ్రోగించి

ఆ మోత్రిత పాత్రిశస్త్యాన్ని వారే ప్రచారం చేసుకునే సమయం ఇది; ఆత్మస్తుతీ పరనిందా తప్ప తదన్యమెరుగని స్వకీర్తి భజన పారీణుల ఆటవిడుపు సమయ మిది; సాహిత్య రంగంలో మతా తత్వాలూ, పార్టీలు, వైదికీ నియోగీ, బ్రాహ్మణ అబ్రాహ్మణ, సర్కారు రాయలసీమ విద్వేషాలు విజృంభించిన నేటి సమయంలో—తారుమారైన హాస్యాస్పద విలువలతో వాఙ్మయ చరిత్రలు వెలువడడంలో ఆశ్చర్యంలేదు. కాని, ఈ వాఙ్మయ చరిత్రకారులకు లొంగని యింకొక శక్తి ఉంది. అదొక్కటే సరైన విలువలను నిర్ణయించగలదు.

సర్వస్వతంత్ర శక్తియుక్తమగు కాలప్రభావాన్ని మించిన విమర్శన యంత్రం మరొకటిలేదు. భట్రాజులనూ, కృతకరత్నాలనూ అది మన్నించదు. ఈ మహత్ సత్యాన్ని మొదటిలోనే గ్రహించిన శ్రీ వేంకట పార్వతీశ్వరులు అందుకే ఎన్నడూ సహచరులనూ అనుచరులనూ కూడబెట్టుకుని ప్రచారం చేయిం చుకోలేదు. ఆద్యతన ఆంధ్ర సాహిత్యానికి నిజమైన వైతాళికులు గనక 'మేమే వైతాళికులం!' అని పేదికెక్కి అరవనూ లేదు, సాహిత్య ఏజెంట్లచేత అరిపిం చనూలేదు. మధూత్సవ ప్రారంభకులూ గనక-గురుజాడవారి తరువాత ఆంధ్ర సాహిత్యానికి వైతాళిక గీతం పాడారు. 'వరమనోహర పంచమ స్వరమునెత్తి' ఈ మహాకవులు 'మధురముగ మార్దవముగ మంజులముగ మానసానందకర ముగ మంగళముగ' గానంచేసి ఆంధ్ర సరస్వతిని ఆరాధించారు. ప్రకృతి కవులుగా ఈ కళ్యాణ జగత్తులోని జీవన మాధుర్యాన్ని ఎలుగెత్తి చాటారు. పరమేశ్వరుణ్ని విశ్వప్రియుడిగా సంభావించి వివశులై కీర్తించి రసైక హృద యాలను పులకితం చేశారు, జాతీయ కవులుగా జాతీయ గీతాలాలాపించి 'అదే ప్రభాత కాంతులతోచె నరయుమిపుడు .... అట్టి యీ వేళ నీ యింట నాంధ్ర పుత్ర .... నీవు సోమరితనమున లేవలేక నీ స్వధర్మంబులన్నియు నీట గలిపి.... బేలువడి కన్ను మోడ్పగా బోలునయ్య!' అని ఉద్బోధించి జాతిని ఉత్తేజితం చేశారు. ఇలా అర్ధశతాబ్దంపాటు ఆంధ్ర సాహిత్యారామాన్ని వేంకట పార్వతీశుల జంట సురభిళంచేసి అక్షర సంపదను సృష్టించినది.

విధి ప్రేరణ వల్ల నేడా జంటలో ఒకరు అస్తమించారు. కవుల ఋణం తీర్చుకునే అలవాటులేని వర్ధమానాంధ్ర జాతికి ఆ మహితాత్ముని, ఆ కవి మూర్ధ న్యుని స్మృతికి నమస్కరించడం ఒక్కటే నేడు మిగిలింది. ఆ కవిద్వయంలో ఒకరైన శ్రీ బాలాంత్రపు వేంకటరావుగారు మన మధ్య ఉండడం జాతికి కొంత ఊరట కలిస్తుంది. శ్రీ వేంకటరావుగారు పూర్ణాయుష్కులై శతవర్షజీవిగా ఆంధ్ర భారతిని ఆరాధింతురుగాక అన్నదే నేటి మన ప్రార్థన. శ్రీ వేంకటపార్వతీశ్వ రులు శ్రీ మద్రామాయణాన్ని ఆంధ్రీకరిస్తున్నారు. సుందరకాండ ఘట్టంలో

ఉండగా—యిప్పుడు శేషభాగాన్ని పూర్తిచేయవలసిన భారం శ్రీ వేంకటరావు గారిపై పడింది. వారు దనిని తప్పకుండా పూర్తిచేసి తెలుగు సరస్వతికి అర్పించగలరు. మధురమైన ఆ మహాకావ్య నిర్వహణకోసం అవసరమైన తపస్సు, ప్రతిభా వారివద్ద ఎలాగూ ఉన్నాయి. 'యేపుగా రూపుగా తోచుసంత లోనే చూపులో ‹బాపయై కవితాపురాణి'. తథాస్తు.

-)0(-

— తెలుగు స్వతంత్ర
(జూన్ 24, 1955)

బెంగుళూరు నుండి వచ్చిన ఓ మిత్రుడు యీ ఉదంతం చెప్పాడు : ఈ మధ్య ఆ పట్టణానికి ఆంధ్రదేశం నుండి పేరు పొందిన ఓ పండితుడు వెళ్ళాడట. లాంఛనం తప్పకుండా నలుగురు ఆంధ్రులూ కలిసి ఆయన ఉపన్యాసం ఒకటి ఏర్పాటు చేశారు : ఆ మహా పండితుడు మూడున్నర గంటలసేపు అనర్గళంగా యిచ్చిన ఉపన్యాస సారాంశం యిది : కాళిదాసు రఘువంశం అంటే మరేమిటీ కాదు, అదొక ఫిజిక్స్‌శాస్త్ర గ్రంథం. కుమార సంభవం కెమిస్ట్రీ టెక్స్టు పుస్తకం. ఆ రోజుల్లో శాస్త్రగ్రంథాలన్నీ శ్లోకాల్లోనే వ్రాసేవారుగనక కాళిదాసు కావ్య రూపంలో శాస్త్రగ్రంథాలను రచించాడు. ఇక మేఘ సందేశం అంటే ఆనాడు కాళిదాసు ప్రపంచ పర్యటన గావించి వ్రాసిన యాత్రా గ్రంథం.

ఆ పండితుడు ఉద్ఘాటించిన యింకో విషయం : పూర్వం జర్మనీదేశాన్ని బిస్మార్కు మహారాజు పరిపాలిస్తుండే కాలంలో భారతదేశంలో ఒక మహా పండితుడుండేవాడు. ఆయనకు అథర్వవేదం క్షుణ్ణంగావచ్చు. ఈ సంగతి తెలిసిన జర్మనులు గమ్మత్తుచేసి ఆ పండితుణ్ణి జర్మనీ తీసుకుపోయారు. అథర్వ వేదంలో ఉండే సమస్త రహస్యాలూ బలవంతంగా చెప్పించేసుకున్నారు. సమస్త రహస్యాలూ తెలుసుకున్న తరువాత, చచ్చిపోయిన మనిషిని బ్రతికించడం ఎలాగో ఆ కిటుకుకూడా చెప్పవలసిందని అతణ్ణి వాళ్ళు వత్తిడి చేశారట. ఆ పండితుడు 'అథర్వ వేదంలో ఉన్న ఆ ఒక్క రహస్యాన్ని మాత్రం ిక తీసినా చెప్పను!' అన్నాడట. పోనీరే చాలా రహస్యాలు తెలిశాయి అని జర్మ

నులు అంతటితో పోనిచ్చి అథర్వవేదం సహాయంతో ఎన్నెన్నో కొత్త యంత్రాలు కనిపెట్టారట. తర్వాత జర్మనులు కనిపెట్టామని చెప్పుకునే కొత్త యంత్రాలన్నీ అథర్వవేదంలో ఉన్నవేనట !- ఉపన్యాసకుడివన్నీ చెప్పుకుపోతూ ఉంటే సభలో ఉన్న చెట్టియార్లు కొందరు తన్మయులై "మహాశయా ! ఇవన్నీ వెల్లడి చేస్తూ మీరొక పుస్తకం రాసెయ్యండి, ప్రచురణకి కావలసిన ధన సహాయం మేంచేస్తాం!' అన్నారట. ఆంధ్ర సంస్కృత పండితు డంగీకరించాడు.

పుస్తకం తయారవుతున్నట్లే మనం భావించుకోవచ్చు. ఆ విషయాలేవో తేలిపోతే, యిప్పుడమల్లో ఉన్న ఫిజిక్స్, కెమిస్ట్రీ పాఠ్యపుస్తకాలవతల పారేసి హాయిగా రఘువంశ, కుమార సంభవాల ద్వారా కావలసినంత ఫిజిక్స్ , కెమిస్ట్రీ, కాలేజీలో బోధించవచ్చు. ఇంకాను మాట్లాడితే అథర్వవేదం సహాయంతో హైడ్రోజన్ బాంబులు తయారుచేసుకోవచ్చు. ఇప్పుడుండే రిసెర్చి లెబొరెటరీ లన్నీ ఎత్తేసి వాటిస్థానే అథర్వవేదం పాఠశాలలు నెలకొల్పవచ్చు. అప్పుడు రైళ్ళకు ఆవిరిశక్తి అక్కరలేదు, యంత్రశక్తి చాలు. మన ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ పుష్పక విమానాల్ని నడుపుతుంది. విదేశీయులకి బోలెడంత డబ్బిచ్చి విమానాలు కొనుక్కోనక్కరలేదు. అపుడు మన మిలిటరీ శాఖ ఆయుధాలు సైతం మారిపోతాయి. సైనికులందరు మంత్రించిన విల్లంబులు ధరిస్తారు.

సభా వివరాలు చెప్పి మిత్రుడు ప్రశ్న వేశాడు : మీరు సంస్కృతానికి వ్యతిరేకులా ? అనుకూలురా ? అని - ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తోచక, 'మీరు పాపికొండలకి అనుకూలురా వ్యతిరేకులా'? అని తిరిగి ప్రశ్న వేశాను. ఈ ప్రశ్నకి ఎంత అర్థం ఉందో, ఆ ప్రశ్నకీ అంతే అర్థం ఉంది. ప్రశ్నలో ఏదైనా ప్రతిపాదన ఉంటేగదా, వ్యతిరేకత అనుకూలత అనే ప్రశ్న వస్తుంది ! "నేను పాపి కొండల్ని సమర్థిస్తున్నాను" అని గాని లేదా "పాపి కొండల్ని నేను వ్యతిరేకిస్తున్నాను" అనిగాని అంటే ఆ మాటలకి అర్థంలేదు. "పాపి కొండలు" అనేది ఏ ప్రతిపాదనాకాదు, అదొక వాస్తవిక. అంతే. అలా కాకుండా "మన రాజధానిని తీసుకవెళ్ళి పాపికొండలలో పెడదాం" అంటే అది ప్రతిపాదన అవుతుంది. అప్పుడు దానిని సమర్థించడమో వ్యతిరేకించడమో జరుగుతుంది.

నేడు సంస్కృతాన్ని గురించి ఆంధ్రలో జరిగే వాదోప వాదాలలో అధిక భాగం యిలాగే అర్థహీనంగా ఉన్నవి. ప్రతి చిన్న విషయానికీ జనాభా యావత్తూ రెండుగా భాగించడం మనకు పరిపాటి. దేనికైనా దుమారం లేవదీయడమే గాని-పూర్వాపరాలు ఆలోచించి వివేకంగా పరిశీలన జరపడం అలవాటు లేదు. అప్రస్తుత విషయాలెన్నో తర్కనభరనకు వస్తాయి; వాటిలోంచి మరికొన్ని అప్రస్తుత విషయాలు ఉదయించి చిందరవందర ఎక్కువ చేస్తాయి. హైస్కూల్

తరగతులో యిప్పటికే మూడుభాషలు నిర్బంధంగా చదివిస్తున్నారు కదా, నాలుగో భాష కూడ నెత్తినరుద్ది నిర్బంధం చేయడం ఎంతవరకు సబబు అని ప్రశ్నించే సరికి—"ఈ సృష్టి ఎలా పుట్టింది?" అని మొదలుపెట్టి రభస లేవదీస్తున్నాం. వేదాలు పౌరుషేయములా, అపౌరుషేయములా? భారతీయుల ఆధ్యాత్మికసంపద ఎంత గొప్పది? ఈ సమస్త ప్రపంచంలోని సమస్త ప్రజలూ అజ్ఞానంతో కొట్టుకుంటూంటే—వాళ్ళకి జ్ఞానం కలిగించి నాగరికుల్ని చేసింది మనం కాదా?—ఇలా ప్రారంభించి మన గ్రంథాలన్నీ ఎవరో దొంగిలించేశారనీ, వేదాల్లో రైళ్లు తయారుచేయడం మొదలు మూడవ పంచవర్ష ప్రణాళిక దాకా అవన్నీ ఉన్నా యనీ మనకీ మనమే భరోసా చెప్పుకుంటున్నాం. "మన పుస్తకాలు ఎవరో కొట్టేశారు — లేకపోతేనా!" అంటున్నాం. "రఘు మహారాజు కాలంలో ధేనువులు పుష్కలంగా పాలిచ్చేవి" అని లొట్టలు వేసుకుంటూ కళ్ళు మూసుకుని గతం గురించి కలలు కంటున్నాము. ఒక్కటే చిక్కు: ఆ ధేనువులు యిప్పుడు లేవు. ఆ రఘు మహారాజూ లేడు. ఇప్పటి ధేనువులు బక్కచచ్చి ఉన్నాయి. మనుషులూ అలాగే ఉన్నారు. మనకి అపారమైన ఆధ్యాత్మిక సంపద ఉంది, ముప్పైఆరుకోట్ల జనాభా ఉన్నారు. అంతే, యింకేం లేదు. అంచేత ఆ ఆధ్యాత్మిక సంపదనీ భౌతిక దారిద్ర్యాన్నీ సమానంగా పంచేసి, వాటితో అలాగే మగతగా కాలక్షేపం చేస్తున్నాం.

ప్రతి వాళ్ళకీ యిప్పుడు "రివైవలిజం"—అంటే గతాన్ని మళ్ళీ పునరుద్ధరించడం—యిప్పుడొక "ఫ్యాషన్" ఐపోయింది. అధికారులకూ, రాజకీయ నాయకులకూ మరీ అదొక ప్రధానమైన వ్యాపకంగా తయారైంది. "పదండి వెనక్కి, యింకా వెనక్కి వెళ్ళిపోదాం!" అదే నేటి నినాదం. వర్తమానంలోని సమస్యలను ఎదుర్కొనే పరిజ్ఞానం లేదు, అభిలాష అంత కన్నా లేదు. అంచేత ప్రజల్ని మభ్యపెట్టడానికి ఏవో తమాషా కబుర్లు చెప్పి, గత కాలపు కాశీపటంలో గమ్మత్తైన బొమ్మలు చూపించి—"అక్కడికి పోదాం!" అని గడుసు కబుర్లు చెపుతారు. "మార్పు" అనేసరికి యుడుసుకొని జ్వరం తెచ్చుకునే వర్గాలకు గత కాలం అనేసరికి ప్రాణం లేచి వస్తుంది గనక, యీ నాయకులకు ఆ వర్గాలండగా నిలుస్తున్నాయి, నియంతృత్వానికి ఈ చివర కమ్యూనిస్టులుంటే — ఆ చివర ఈ అభివృద్ధి నిరోధకులుంటారు. ఇద్దరిదీ నియంతృత్వమే. ఇద్దరూ ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అణచివేసి ప్రజా స్వామ్యాన్ని భూస్థాపితం చేయడానికే చూస్తారు. ఒకరు వామపక్ష నియంతృ త్వాన్ని కోరితే, యింకొకరు "రైట్‌వింగ్" నియంతృత్వాన్ని కోరుతారు. "లిబరలిజానికి" యిద్దరూ వ్యతిరేకులే. "పెనం నుండి నిప్పులో కురికినట్లు" ఆంధ్రప్రదేశపు ప్రజానీకం నేడు కమ్యూనిస్టు నియంతృత్వ శక్తుల్ని ఓడించి

అటు చూసేసరికి ''రైట్‌వింగ్'' నియంతృత్వం ఎదురవుతున్నది. వీళ్ళుపయోగించే సమ్మోహనాస్త్రాలు: మతం, మన పురాతన సంస్కృతి, తిరిగి వెనక్కి వెళ్ళిపోవడంలో ఉండే హాయి యిలాంటివి. అభ్యుదయ నిరోధక శక్తులన్నీ యీ గుడారంలో చేరిపోయాయి. వర్ణాశ్రమ ధర్మాలను పునరుద్ధరించాలనుకునే వాళ్ళు, సామ్యవాద సిద్ధాంతాలను ప్రతిఘటించదలుచుకున్నవారు, నూతన సమాజ వడికీ, వేగానికీ తట్టుకోలేనివాళ్ళూ, పాత వ్యవస్థలు మళ్ళీ మొలిస్తే పెత్తనం చెలాయించవచ్చుగదా అని ఉవ్విళ్ళూరేవారు—అందరూ ఏకమై భారీ ఎత్తున ప్రచారం లేవదీస్తారు.

ఇప్పటి సంస్కృత భాషా చర్చ యింత ముమ్మరంగా జరుగుతున్నదంటే—దాని అంతర్యం వేరే ఉన్నది. అంతేగాని అదొక విడి సమస్య కాదు. అందుకే సమస్య పెడదారి పట్టించి, తమ ప్రయత్నాలను ప్రతిఘటించేవారిని చూపించి—''చూశారా! వీరంతా మన పవిత్ర భారతీయ సంస్కృతికీ, సంప్రదాయాలకు వ్యతిరేకులు! ఆంగ్ల మానస పుత్రులు! పాశ్చాత్య వ్యామోహంలో పడి కొట్టుకుంటున్నారు!'' అని గంభీరంగా భంగిమ వేసి, తమ పోకడలను వ్యతిరేకించే వారంతా జాతీయాభిమానం లేనివాళ్ళనీ, భారత సంస్కృతికి వ్యతిరేకులనీ, అభాండాలు వేయడానికి ప్రయత్నిస్తారు. అక్కడికి భారత సంస్కృతిని ఉద్ధరించే అర్హత వీళ్ళే గుత్తకు తీసుకుంటున్నట్టు! కాని, భారతీయ సంస్కృతి అంటూ ఒకటుంటే అది యిటువంటి వారివల్ల ఎప్పుడూ రక్షింపబడలేదు. ఈ రకం మనుషులంతా సమాజాన్ని ఎప్పటికప్పుడు నరకట్లువేసి బిగించడానికే ప్రయత్నం చేశారు. అవి ఈ సమాజాన్ని మరీ ఉక్కిరిబిక్కిరిచేసి ప్రజాజీవనం మరీ దుర్భరం అయినప్పుడు, సమాజంలోని ఒక ప్రతిభావంతుడు పుట్టుకొచ్చి, ఆ నరకట్లు ఛేదించి, ప్రజలు మళ్ళీ ఊపిరి పీల్చుకునేట్లు చేశాడు. లేకపోతే భారతీయ సంస్కృతి ఏనాడో నశించేది. మన సంస్కృతిని కాపాడినది పూజారులూ, మఠాధిపతులూ ''చాతుర్వర్ణ్యం మయాసృష్టిః'' అంటూవల్లెవేసి కూపస్థ మండూకాలుగా బతికిన వాళ్లూ, స్త్రీలకు సహగమనమే శరణ్యం అని వాళ్ళను తీసికెళ్లి మంటలలో పడేవాళ్లూ కాదు. ఎప్పటికప్పుడూ ఆ కాలప్రభావాన్ని గుర్తించి సమాజాన్ని ముందుకు తీసుకెళ్లిన వాళ్ళే భారతీయ సంస్కృతిని కాపాడారు. సముద్రప్రయాణాన్ని నిషేధించి అగ్రహారంలో కూర్చొని జపం చేస్తున్న వాళ్ళా భారత సంస్కృతిని కాపాడారు? లేదా విశ్వజనీనమైన ఒకే సందేశం యివ్వడంకోసం ఖండాంతరాలు ప్రయాణం చేసి ఇండో-చైనాలో, తాయ్‌లాండ్‌లో, ఇండోనేషియాలో శిల్ప సంపద నెలకొల్పిన వాళ్ళా భారతీయ సంస్కృతిని కాపాడారు? నాడు రామమోహనరాయలు అందరినీ ఇంగ్లీషు నేర్చుకోమన్నాడని నేడు కళ్లెర్రజేసే ''జాతీయవాదులు'' యిప్పటికీ అంతవరకు చెప్పి ఊరుకుని, రేపు సహగమనాన్ని

మళ్ళీ అమలులోకితెస్తూ, "నాడు పాశ్చాత్య వ్యామోహంలో పడి రామమోహన్ రాయ్ సహగమనాన్ని మాన్పించాడు!" అని హుంకరిస్తారా? అలాగే వీరేశలింగం కూడా "భారతీయ సంస్కృతి"కి వ్యతిరేకి. ఎంచేతనంటే వితంతువులకు కేశ ఖండన మాన్పించి పునర్వివాహపు హక్కు కల్పించాడు. రేపు గాంధీజీనిసైతం జాతీయతా వ్యతిరేకి అంటాం. ఎంచేతంటే వర్ణ సంకరం చేసేశాడు. ఈ మనస్తత్వానికి అంతెక్కడ? నేడు మన ఉత్తమ భారతీయ సంస్కృతిని కాపాడుతున్నది పండిత నెహ్రూవా, స్వామీ కరపాత్రజీయా?

సంస్కృత భాష ఔన్నత్యాన్నీ, దాని రక్షణ భారాన్నీ భుజంమీద వేసుకున్న ఈ అభ్యుదయ నిరోధక వాదులను విడదీసి ఆలోచించగలడం యిప్పుడవసరం. అభ్యుదయవాదులెవరికీ సంస్కృతంతో పేచీలేదు. ఈ తిరోగమన వాదుల, అభ్యుదయ నిరోధకుల భారినుండి సంస్కృతాన్ని రక్షించి, దాని నిజమైన ఔన్నత్యాన్ని, సాహిత్యాన్నీ సరియైన రీతిలో కాపాడడమే నేటి సహృదయుల విధి. సంస్కృతం పేరిట విజృంభిస్తున్న ఈ తిరోగమనవాదులు తిరిగి సమాజం మీద పెత్తనం చెలాయించకుండా సకాలంలో అరికట్టాలి. సుత్తిని సుత్తిగా ఎవడూ ద్వేషించడు, అలాగే కొడవలిని కూడా. రెండూ మనకెంతో ఉపయోగకరమైన పనిముట్లు. అలాగే 'ఎరుపు' అనే రంగుతో పేచీ ఎవరికి? కానీ—ఈ మూడూ కలిసిన ఒక చిహ్నం—ఒక మనస్తత్వానికి, ఒక నియంతృత్వానికి ప్రతినిధి. విజ్ఞులందరూ సంస్కృతభాషా ఔన్నత్యానికి ముగ్ధులవుతారు, అందులోని సాహిత్యాన్ని గౌరవించి ఆస్వాదిస్తారు. ఆ భాషను జాగ్రత్తగా పోషించుకుంటారు. కాని సంకుచిత మనస్తత్వాన్ని ప్రయత్నించడంకోసం యీ సంస్కృత భాషా సమస్యను ఒక ఆయుధంగా ప్రయోగించే అభ్యుదయ నిరోధకుల విజృంభణను మాత్రం అరికట్టి తీరాలి.

-)o(-

—తెలుగు స్వతంత్ర
(జులై 15, 1955)

"ఇటువంటి సంఘటనలు మన హృదయాలను కదిలించడం సహజం. మృత్యువునకు అభిముఖంగా ఎంచుకున్న చలించని ధైర్యం నిజంగా గొప్పది. సత్యాగ్రహుల మరణవార్త మనకి దుఃఖాన్ని కలిగిస్తుంది నిజమే; ఐనా అంతటి ధైర్య సాహసాల ప్రదర్శనం మనకు సంతోష, గర్వకారణమని కూడా నేనంటాను. మరణం అన్నది ఎప్పుడో ఒకప్పుడు ఎవరికీ తప్పదు; కాని మృత్యువును ఎదుర్కొనే పద్ధతిలోనే తేడా ఉన్నది. మృత్యువును జయించే ధైర్యం మనకు మార్గదర్శకంగా ఉండి మనందర్నీ పునీతుల్ని చేస్తుంది''.—అని సీతాపూర్ సభలో పండిత నెహ్రూ. ప్రసక్తి : కొందరు గోవా సత్యాగ్రహుల మరణం.

ప్రాణాలు కోల్పోయిన త్యాగమూర్తులలో యిద్దరు ఆంధ్ర యువకులు కూడ ఉన్నారు. వారి అకాల మరణానికి పరితాపం చెందని ఆంధ్రుడుండడు. ఇద్దరూ లేత వయస్సు యువకులు. ఒక ఆదర్శం ప్రోద్బలం కాగా, నిండు హృదయంతో సత్యాగ్రహంలో ఆహుతైనారు. రాజకీయంగా చైతన్యవంత మైన ఆంధ్రదేశంలో, విద్యార్థులు మరీ చైతన్యవంతులు. రాజకీయోద్యమాలు వారిని అతి శీఘ్రంగా ఉద్వేగుల్ని చేస్తాయి. గోవా సత్యాగ్రహమూ వారిని ఆ విధంగానే ప్రబోధించింది. ఈ ఉద్యమంలో భారతదేశంలోని వివిధ రాజకీయ దృక్పథాలవారు పాలొంటున్నారు. అందర్నీ బంధించే ఏకైక ఆశయం గోవా విమోచనం. ఆశయ సిద్ధికి మార్గం సత్యాగ్రహం. ఈ సత్యాగ్రహం అనేది గాంధీజీ రూపొందించిన ఒక విలక్షణ ఆయుధం. సత్యాగ్రహం చేసేవారు మనోవాక్కాయ కర్మల్లో హింసను పూర్తిగా విడనాడవలసి ఉంటుంది. ఈ అంశాన్నే స్పష్టం చేస్తూ, ఒక చెంప సత్యాగ్రహంలో పాలొనే పార్టీలవారే యింకొక చెంప గోవాపై పోలీసు చర్య జరపవలసిందని ఆందోళన చేయడం తగదని నెహ్రూ హెచ్చరించారు. ఆ రెండూ ఒకదానికొకటి చుక్కెదురు. రెండిటినీ కలిపి మాట్లాడితే మన ఆలోచనలు తప్పుదారి పడతాయన్నారు పండిత నెహ్రూ. సత్యాగ్రహపు సంగతి సందర్భాలు తెలియని విదేశీయులు ఏమైనా మాటాడవచ్చుగాని, గడచిన ముప్పై ఐదేండ్లుగా సత్యాగ్రహంలో తర్ఫీదు పొందిన భారతీయులు బాధ్యతారహితంగా మాట్లాడడం తగదన్నారు. గోవా సమస్య ఏ విధముగా పరిణమిస్తుందో, తుద కేవిధంగా పరిష్కార మౌతుందో తానిపుడే చెప్పలేనంటూ, ఏదెలా జరిగినా ఇండియా మాత్రం శాంతిమార్గం విడనాడదన్నారు నెహ్రూ.

'సత్యాగ్రహం' యొక్క విజయం ప్రాథమిక నైతిక విశ్వాసంపై ఆధార పడి ఉంటుంది. ప్రతి మానవుడిలోనూ అంతర్గతంగా 'ఉత్తమ మానవత్వం'

ఉంటుందని సత్యాగ్రహి విశ్వసిస్తాడు. ఎదిరిలో ఆ ఉత్తమమైన మానవత్వాన్ని మేల్కొల్పగలిగిననాడే సత్యాగ్రహికి విజయం లభిస్తుంది. లేనినాడు విఫలమౌతుంది. ఒకొక్కప్పుడు వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా వాంఛనీయమైన చర్యలకూ, సత్యాగ్రహి ఆదర్శాలకు మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. అప్పుడు ఏది కర్తవ్యం అనే సమస్యపై గాంధీజీయే అనేక ఘట్టాలలో విపరీతమైన నైతిక జిజ్ఞాసలలోనై పరస్పర విరుద్ధమైన మార్గాల ననుసరించి భిన్న భిన్నంగా గోచరించే ప్రబోధాలను చేసేవాడని నెహ్రూ "డిస్కవరీ ఆఫ్ ఇండియా"లో వ్రాశాడు. ఈ దృష్ట్యా చూస్తే, గోవా విషయంలో నేడు నడుస్తున్న భావ సంఘర్షణలో కొంత అయోమయం ఉన్నదంటే ఆశ్చర్యం లేదు. అది తొలగాలంటే గత చరిత్రను కొంత అర్థం చేసుకోగలగాలి. బ్రిటిష్ వారితో జరిగిన మన పోరాటంలో, బ్రిటిషువారుకూడా 'సత్యాగ్రహం' అనే ఆయుధాన్ని కొంత వరకు మన్నించి గౌరవించారని మనం అంగీకరించి తీరాలి. సత్యాగ్రహి నియమాలను వాళ్ళు పూర్తిగా ఉల్లంఘించలేదు. అందుకే భారతదేశం నుండి అంత గౌరవంగా నిష్క్రమించగలారు. అంత ఔన్నత్యం చూపలేకపోయినా, మొత్తంమీద ఫ్రెంచివారి నిష్క్రమణ కూడా సౌమ్యంగానే జరిగింది.

ఉభయపక్షాలు కొన్ని కనీస నియమాలు పాటించకపోతే "సత్యాగ్రహం" నిష్ఫలం కాక మానదు. చేదుగా ఉన్నా ఈ సత్యాన్ని మనం అంగీకరించక తీరదు. అందులో ఒక పక్షం విశృంఖలంగా ప్రవర్తించి, పడక కుర్చీలలో కూర్చుని తుపాకులు కాల్చి ఖూనీ జరిపితే ఏం చేయవలసి యుంటుంది? సత్యాగ్రహులు నిరాయుధులుగా ఉన్నా, అహింసామూర్తులుగా ఉన్నా, వాళ్ళమీద మెషిన్‌గన్‌లు పేల్చడానికి పోర్చుగీసులు వెనుతీయలేదు, సిగ్గుపడలేదు. ఇక ముందైనా వారు మారుతారనడానికి ఆధారం లేదు. అప్పుడు కర్తవ్యం ఏమిటి? నేడు నెహ్రూ మనస్సును కలవరపరుస్తున్న సమస్య ఇదే. ఇదే రీతిగా సత్యాగ్రహాన్ని సాగించడమా? ఎంతవరకు? లేక సత్యాగ్రహాన్ని నివారించడమా? అపుడు సత్యాగ్రహం అనే ఆయుధం యొక్క నైతిక బలం గాంధీజీతోనే అంతరించిపోయిందని అంగీకరించినట్లవుతుంది. అటువంటి అంగీకారం కాంగ్రెసు సంస్థ ప్రాథమిక నీతి సూత్రాలకే ఓటమి తెచ్చిపెడుతుంది. కాని మళ్ళీ సత్యాగ్రహానికి ప్రత్యామ్నాయంగా యింకో మార్గం చూపనంతవరకూ గోవా సత్యాగ్రహానికి నైతికంగా అభ్యంతరం చెప్పడానికి వీలులేని స్థితిలో ఉన్నది ఇండియా ప్రభుత్వం. ఇలా ఏ ఆలోచన ఆధారంగా మార్గాన్వేషణ చేసినా ప్రతిష్టంభనకే దారితీసే పరిస్థితిలో—కేంద్ర ప్రభుత్వం పైన గురుతరమైన బాధ్యత ఉన్నది. ప్రభుత్వ దృష్టిలో ఇప్పుడేది ఆచరణీయమైన కర్తవ్యం? అనేది స్పష్టం చేయవలసి ఉంది. ఇంతవరకూ ప్రకటనలెన్నో వచ్చాయిగాని వివరణ మాత్రం లోపించింది.

ఇంత సంక్లిష్టమైన వాతావరణంలో గోవా సత్యాగ్రహాన్ని తప్పుదారి పట్టించి స్వప్రయోజనాలకు వాడుకుందికి కొన్ని పార్టీలు ప్రయత్నిస్తున్నాయని, అది నివారించవలసి ఉంటుందనీ నెహ్రూ హెచ్చరించారు. "తాత్కాలికోద్రేకాలకులోనై నేలవిడిచిన సాము చేయకూడదు. ఈ సమయానికి ప్రజాభిప్రాయానికి వెరచి దీర్ఘకాలిక ప్రయోజనాలను మనం మరచిపోకూడదు. ఉద్వేగాలకు లోనుకాకుండా ప్రశాంతంగా ఆలోచించుకోవడం యిపుడెంతైనా అవసరం" అన్న నెహ్రూ మాటలు గమనార్హమైనవి. ఆంధ్ర యువతీ యువకులకు, విద్యార్థులకు అవి మరీ గమనార్హమైనవి. నేటి అయోమయాదర్శాల కోలాహలంలో హృదయానికి ప్రాముఖ్యమివ్వక వివేకానికి ప్రాముఖ్యం యిచ్చి నడుస్తున్న చరిత్ర సింహావలోకనం చేసుకుని తమ కర్తవ్యాన్ని నిర్ణయించుకోవలసియుంటుంది గాని, అవసరాలకు మించిన మూల్యం ఆదర్శాలనుకునేవాటికి చెల్లించడం యుక్తం కాదు. రాజకీయ చైతన్యం అభిలషణీయమే, ఆదర్శాలకై పాటుపడడం శ్లాఘనీయమే; కాని రాజకీయ చైతన్యం నిర్మాణాత్మకంగా విస్ఫూర్తి చెందాలి; అలాగే ఆదర్శాల సాధనకై కృషి కుద్యమించేముందు నేడు అపురూపమైన ఆదర్శాలేవో అవగాహన చేసుకుని ఉండాలి. 'నినాదాలతో ఊరేగింపులతో కాలం వృధాచేసే రోజులు గతించాయి, అటువంటివారు వెనకపడిపోతారు. ఇండియా పురోగమనానికి ఇపుడు కావలసినవి నినాదాలు కావు: శ్రమా, కృషీ, అధికోత్పత్తి కావాలి' అని యువకుల్ని ఉద్దేశించి నెహ్రూ ప్రబోధం. ఆదర్శాల నిర్వచనం యింత సూక్ష్మమైన విభేదాల ననుసరించి రకరకాలుగా ఊగిసలాడే వేళల్లో ఆంధ్ర విద్యార్థిలోకం ప్రశాంతంగా ఆత్మపరీక్ష చేసుకుని తమ ఆదర్శాల పరిధిని అతి విస్తృతం చేసుకోకుండా, రాష్ట్రాభ్యుదయం కోసం పాటుపడి తద్వారా దేశాభ్యుదయ కార్యక్రమంలో తోడ్పడవచ్చును. ఏ రకం రాజకీయ చైతన్యానికైనా, ఆదర్శాభినివేశానికైనా అవధి అదే గదా!

oOo

—తెలుగు స్వతంత్ర
(ఆగష్టు 26, 1955)

అలనాటి బంగారు కాలంలో — అంటే యీ శతాబ్దపు ప్రారంభంలో — రాజకీయ రంగంలోకి ఉరికిన వారందరూ యోధానయోధులు; ప్రధిత పండితులు; అద్భుత ప్రజ్ఞ గలవారు. రాజకీయాలను ఉన్నతమైన ధోరణిలో ఉంచడమే గాక కళా, సాంస్కృతిక రంగాలలో సైతం అభినివేశం కనబరచి వాటిలోనూ కృషి చేసి రాణించారు. నిద్రాణమైన జాతీయతను మేల్కొల్పడమంటే ఒక్క రాజకీయ రంగమే గాక కళా, సంస్కృతీ రంగాలు కూడ అమిత ముఖ్యమైనవని గ్రహించి కృషి చేసిన బహుముఖ ప్రతిభావంతులప్పటి మహనీయులు; తిలక్ మహరాజ్ భగవద్గీతకు భాష్యం వ్రాయడమేగాక వేదాల జన్మస్థలం గురించి కాలం గురించి అధికారమైన పరిశోధనలు చేశాడు; మోతీలాల్ నెహ్రూ, తేజ్ బహదూర్ సప్రూ మొదలైనవారంతా బహు భాషా పండితులు, కళాకోవిదులూ, కళా పండితులునూ, నిండైన జీవితం గడిపారు కనుక జీవన మాధుర్యాన్ని, కళా సౌందర్యాన్నీ గౌరవించ గలిగేవారు. తేజ్ బహదూర్ సప్రూ పర్షియన్, అరబ్బీ భాషలలో చూపిన పాండితీ ప్రతిభ మధ్య ప్రాచ్యంలో పండితుల్ని ఎంత సమ్మోహితం చేసిందో విశదం చేసే ఉదంతాలెన్నో గ్రంథస్థమై ఉన్నాయి. ఇస్లామ్ సంస్కృతి గురించి సప్రూ ముందు ప్రసంగించడానికి మహమ్మదలీ జిన్నాకు జంకుగా ఉండేదట. గాంధీజీకి ఇంగ్లీషు భాషపై ఉన్న "అధికారం" ఆంగ్లేయుల్నే ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఇంగ్లీషులో ఏ మహా రచయితకీ గాంధీజీ తీసిపోడని అందరూ అంగీకరించారు. ప్రధాని నెహ్రూ ప్రతిభ సరే; గొప్ప వక్తగానే కాక నెహ్రూ ఒక మహా రచయితగా కూడా తన ప్రతిభ నిరూపించుకున్నాడు. ఆ తరం నాయకులలో రాజకీయాలలోనే గాక — యితర రంగాలలోకూడా పన్నెక్కిన వారెందరో ఉన్నారు. పండిత గోవిందవల్లభపంత్ హిందీలో అగ్రశ్రేణికి చెందిన రచయిత; గుజరాతీ సాహిత్యంలో నవలాకారుడిగా కన్యాలాల్ మున్షీకి కూడా ఉన్నత స్థానమే ఉంది. ఇటువంట ఉదాహరణలెన్నైనా చూపవచ్చును.

క్రమంగా అటువంటి మహానాయకులు కరువైపోయారు. ఆంధ్రదేశంలో ఆ తరహా నాయకత్వమే ఎప్పుడూ ఉన్నట్లు లేదు. ఆదిలో లిబరల్ నాయకులుగా పేరు తెచ్చుకున్న సర్ బి. యన్. శర్మ, మోచర్ల, న్యాయపతి సుబ్బారావు మొదలైనవారు రాజకీయ పరిధిదాటి కృషి చేయలేదు. డాక్టర్ పట్టాభిగారు చాలా గ్రంథాలు వ్రాశారు; అధికారికంగా కాంగ్రెస్ చరిత్ర వ్రాశారు. ఐనా వారి గ్రంథాలకు నేటికీ సాహిత్య గౌరవం లభించలేదంటే సత్యదూరం కాదు. ఆ తరం రాజకీయ నాయకులలో ఒక్క కట్టమంచి రామలింగారెడ్డిగారికే ఆ కీర్తి దక్కుతుంది. పోగా సహాయ నిరాకరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహం ముమ్మరంగా సాగిన రోజుల్లో మేధావి వర్గంనుండి — ముఖ్యంగా న్యాయ

వాదుల, టీచర్ల, డాక్టర్ల వరంనుండి చాలామంది ఉద్యమంలో చేరారు. ఐనా సాంస్కృతిక రంగానికి రాజకీయ రంగానికి సాన్నిహిత్యం ఏర్పడలేదు. ఒక దానికొకటి దూరంగానే ఉంటూ వచ్చాయి. అలాగే సాహిత్య రంగంలోని వ్యక్తులను ఆ నాటి రాజకీయాలు ఎందుకో కదపలేకపోయాయి. ఏ ఒక్క తలావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారో, కొడాలి ఆంజనేయులుగారో. మినహాయిస్తే సాహిత్య వేత్తలూ తదితర కళాకారులూ ఉద్యమాలకు దూరంగానే ఉండి పోయారు. తత్ఫలితంగా కాంగ్రెస్ సంస్థ (ఆంధ్రలో) సాంస్కృతిక, సామాజిక రంగాలతో ప్రమేయం లేకుండానే కాలం వెళ్ళబుచ్చింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత నాయకులు క్రమంగా సాంస్కృతిక, సాహిత్య రంగాలను లీలగా గ్రహించారు. కాని వారి కారంగాలు పూర్తిగా కొత్త. సన్నిహితత్వం ఏర్పరుచుకునే విధానాలంతకంటే కొత్త. కాని అధికారం లోకి వచ్చారు గనక కళాపోషకులుగా చలామణి కావలసిన పరిస్థితులు ఏర్ప డ్డాయి. దానికి తోడు ''సర్వజ్ఞత్వం'' ఆపాదించుకోవడం వారికెప్పుడూ అల వాటు గనక ఫిర్కా రాజకీయ సభకూ, కర్ణాటక సంగీత గాయకుల సభకూ అధ్యక్షత వహించి ఒక్క ధోరణిలోనే మాట్లాడడం నేర్చుకున్నారు; విషయం భరతనాట్యమైనా సరే, మల్లయుద్ధ ప్రావీణ్యమైనా సరే, చిత్రలేఖనమైనా సరే — ఆయా విషయాలమీద అనర్గళంగా ఉపన్యసించి సలహా లివ్వడం వారికి పరిపాటి. ముప్పై సంవత్సరాలు స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటం ఫలితంగా పత్రికావరంకూడా రాజకీయాలకూ, రాజకీయ నాయకుల ఊకదంపుడు ఉపన్యా సాలకిచ్చే ప్రాముఖ్యం యింకే విషయాలకూ, యివ్వదు. పత్రికావర్గం దృష్టిలో ''రాజకీయం'' కానిది వార్తకాదు. మన ''జాతీయ'' పత్రికలనేవి సైతం ఏ అనామక మంత్రిగారో యిచ్చిన అర్థంలేని ఉపన్యాసాన్ని పతాక శీర్షికలతో ప్రక టిస్తాయిగాని, తదితర రంగాలలో ఎంతటి ప్రముఖుడు మాటాడినా గుర్తించవు; అథవా గుర్తించినా పత్రికలో ఏ మారుమూలనో నాలుగైదు పంక్తులు కేటా యించి ఆ ప్రముఖుడికి మహోపకారం చేసినట్లు భావిస్తాయి. వేళ్ళు పాతుక పోయిన ఈ అవకతవక సంప్రదాయం యిప్పట్లో మారే సూచనలు లేవు. ఈ శోచనీయస్థితిలోంచి యింకో దుష్ట సంప్రదాయం అంకురించి బలపడుతున్నది. రాజకీయ రంగేతరాలలో పనిచేసే కళాకారులూ, సాంస్కృతీ పరులూ, శాస్త్ర వేత్తలూ, విద్యావేత్తలూ అందరూ అధికారంలో ఉన్న రాజకీయవేత్తలను ఆశ్ర యించవలసి వస్తోంది; గాయకుల సమావేశం జరిగితే అధ్యక్షత వహించేది గాయకుడు కాదు, సంగీతమంటే ఏమిటో తెలియని మంత్రి; చిత్రకళా ప్రద ర్శనానికి ప్రారంభోత్సవం చేసేది కళా విమర్శకుడు కాదు, చిత్రకారుడంత కన్నా కాదు; పదిసార్లు జైలుకెళ్ళడం తప్ప యింకే పాపం పుణ్యం ఎరగని

మంత్రిగారు. అంతటా యిదే సూత్రం. పోనీ అధికారం వారికి ఆ అర్హత కలి గిస్తుంది గనక అధ్యక్షత వహించినా, ప్రారంభోత్సవాలు జరిపినా సరిపెట్టుకో వచ్చు—వారే గనక కొన్ని ప్రాథమిక విలువలను పాటించగలిగితే. నాయకులు మనల్ని అంత మాత్రమూ కరుణించరు. సర్వజ్ఞత్వాన్ని వదులుకోలేరు. తల నెరసిన నాట్యాచార్యులమధ్య నిలబడి భరతనాట్య ప్రాశస్త్యాన్ని విశదీకరిస్తారు. సాహిత్యానికే జీవితాలను అంకితమిచ్చిన సాహితీపరుల సమావేశాలతో నిలబడి సాహిత్యం అంటే ఏమిటో నిర్వచిస్తారు.

ఇటువంటి వాతావరణంలో—మొన్నటి స్వాతంత్ర్య దినోత్సవ సమ యంలో పశ్చిమ బెంగాల్ కాంగ్రెస్ కమిటి సరికొత్త తోవ తొక్కిందంటే అందరికీ ఆశ్చర్యంతో పాటు సంతోషంకూడా కలుగుతుంది. ఆ కమిటీ ఒక్క వారం రోజులపాటు రాజకీయాలు వెనక్కినెట్టి కేవలం సాంస్కృతిక ఉత్సవం జరిపి వివిధ కళాకారుల్ని సన్మానించింది. వారిచేత ఉపన్యాసా లిప్పించి కాంగ్రెస్ నాయకులు శ్రద్ధగా విన్నారు. అలా సన్మానింపబడిన వారిలో ముఖ్యులు: మహా గాయకుడు ఉస్తాద్ అల్లాఉద్దీన్ ఖాన్; చిత్రకారుడు జామినీ రాయ్; భాషా శాస్త్రవేత్త డాక్టర్ సునీతికుమార్ చటర్జీ; ప్రజాకవి కుముద్ రంజన్ మల్లిక్; ప్రఖ్యాత నటుడు శిశిర్ కుమార్ చౌధురీ; ఎవరెస్టు విజేత టెన్సింగ్ నార్కే; ఫుట్‌బాల్ క్రీడా నిపుణుడు గోస్తాపాల్. వీరందరూ తమ తమ రంగాలలో అగ్రగణ్యులు; సృజనాత్మక కృషిద్వారా ఘన సంస్కృతిని సుసంపన్నం చేసినవాళ్ళు. పశ్చిమ బెంగాల్ కాంగ్రెస్ కమిటీ పెద్దలలో కలిగిన యీ తాత్కాలిక వివేకోదయం పది కాలాలపాటు నిలిచి తక్కిన ప్రదేశ్ కమిటీ లకు మార్గదర్శకం కాగలిగితే బాగుండును. లోగడ ఎప్పుడో శ్రీ రంగాగారి హయాంలో ఆంధ్ర కాంగ్రెస్ కొందరు కవి పండితులకు "శాలువలు" పంచి పెట్టి సంస్కృతీ దోహదానికి అపారసేవ చేసినట్లు సంతృప్తి చెందింది. అల్లూరి వారి అధ్యక్షత కాలంలో ఏదైనా కదలిక కలుగుతుందేమో వేచి చూడవలసి ఉంది.

[o/o]

—తెలుగు స్వతంత్ర
(సెప్టెంబర్ 2, 1955).

శ్రీమాన్ యం. అనంత శయనం అయ్యంగర్ ఆ మధ్య ఢిల్లీలో యజ్ఞం చేయించారు– గోవా మనకి రావడంకోసం. ఖర్చు ఎంతయిందో తెలియదు గాని భారీ యెత్తున హోమాలూ అవీ జరిగాయి. యజ్ఞంచేసి గోవాను రాబట్టాలని శ్రీ అయ్యంగార్ గారి ఆశయం. అలాగే నేడు మనల్నెదుర్కొంటున్న సమస్తమైన సమస్యలకు పరిష్కార మార్గాలు మన వేద పురాణేతిహాసాది విజ్ఞాన భాండాగారంలో ఉన్నాయనీ, గతంలోకి తవ్వుకుంటూపోతే వర్తమానానికి కావలసిన జ్ఞానభారం అంతా లభిస్తుందని నేటి ''సంఘ పెద్దలలో'' చాలామంది గాఢ విశ్వాసం. ఉత్తమ భారతీయ సంస్కృతి అంతా గతంలో నిక్షిప్తమై ఉంది. కావలసిందల్లా దాన్ని పోల్చుకుని వెలికి తీయడమే. ఆ గాఢవిశ్వాసంతో బయలుదేరేసరికి అధునిక జ్ఞానం అంతా మనకి తెలిసిపోయినట్లే ఉంది. అణు విచ్ఛేదన మన పూర్వులకేనాడో తెలుసు. విమానాలు సరేసరి. కృత్రిమ గ్రహాలను సృష్టించిన ప్రసక్తి కూడా రామాయణంలో ఉందని ఆ మధ్య ఒక భారతీయ పండితుడు ఉద్ఘాటించాడు. ఐతే యిక కావలసిందేముంది ?– వైజ్ఞానికంగా మనం స్వయంసమృద్ధులం ...

కాని పండిత నెహ్రూ అలా అనుకుంటున్నట్లు లేదు. ఏనాటి నుండి మనకు యితర దేశాలతో సంబంధం లేకుండా పోయిందో ఆనాటి నుండి భారతీయుల హీనదశ ప్రారంభమైనదని ఆయన నమ్మకం. మొన్నటి మద్రాసు ఉపన్యాసంలో ఈ ప్రసక్తి తీసుకవస్తూ, ''మనకు యితర దేశాలతో క్రమ క్రమంగా సంబంధాలు లేకుండా పోయినవి. మన జాతికి యితర ప్రపంచమే తెలియని పరిస్థితి ఏర్పడినది. ఇతర దేశాలతో సంబంధాలు లేకుండానే స్వయం పోషకంగా ఉండగలమని అప్పుడు భారతీయులు భావించారు. సంఘంలోనేమో కులాలు ఏర్పడినవి. ఈ విషయాలన్నీ తెలుసుకుని మనజాతి బానిసజాతి ఎలా అయిందా అని మీరు ఆశ్చర్యపడవచ్చు. కాని మనజాతి బానిసజాతిగాకాకపూర్వమే ఇండియాలోని మహత్తర శక్తులన్నీ పని చేయకుండా నిలిచిపోయినవి. సాహిత్యంలో నైతేనేమి కళల్లో నైతేనేమి శిల్పంలో నైతేనేమి యీ పతనావస్థను మీరు విస్పష్టంగా చూడగలరు. ఇతర దేశాలతో సంబంధాలనుపెంచుకోక మన వ్యవహారాలనింటినీ దేశం లోపలనే పరిమితం చేసుకున్నకొద్దీ మనం మరింతగా పతనమైపోయాము'' అని హెచ్చరించారు.

చరిత్ర నుండి నేర్చుకోవలసిన గుణపాఠాన్ని పండిత నెహ్రూ వివరించారు. పతనమైతే అయినాము గాని తిరిగి అటువంటి ''స్వయం సమృద్ధస్థితి'' లోకి వెళ్ళిపోవడమే అభిలషణీయమని నేటి పెద్దలలో అనేకుల పట్టుదల. ఆధునిక పరిణామాలకు అనుగుణమైన దృక్పథం వాళ్ళ దృష్టికి విజాతీయంగా

కనబడుతుంది. ఇంగ్లీషు భాషను దేశంనుండి తరిమేద్దాం; అన్ని రంగాలలోను జాతీయతను పునరుద్ధరించుదాం; అనగా విధిగా అందరం సంస్కృతం నేర్చుకుని నిరంతరం గతంలోని ఘనతను కీర్తించుకుంటూ వర్తమానాన్ని భవిష్యత్తుకు వదిలేద్దామని వారి భావన. మార్పు అంటే వాళ్ళకు తగనిభయం కనక ప్రతి చిన్న విషయం వాళ్ళకు దారుణమైన విప్లవంలాగే కనబడి ఋడుసుకుంటాది. స్త్రీలకు ఆస్తి హక్కులు అనేసరికి భయం; హిందూ సమిష్టి కుటుంబ వ్యవస్థ ఏం కానున్నదని బెంగ పెట్టుకుంటారు. ఇంగ్లీషులాంటి ఏదో ఒక విదేశ భాష నేర్చుకోవడం అనివార్యం అంటే ఎన్నాళ్ళీ పాశ్చాత్య నాగరికత వ్యామోహం, ఎన్నాళ్ళీ భావదాస్యం అని నిట్టూరుస్తారు. భూసామ్యంలో సంస్కరణలు అవసరం అంటే ఏమాత్రం మార్చినా మన వ్యవసాయ రంగం పూర్తిగా దెబ్బ తింటుందని శపిస్తారు. స్త్రీలకు విడాకుల హక్కు అవసరం అంటే, అది హిందూ సంప్రదాయానికే వ్యతిరేకమంటారు. ఏ సంస్కరణ తలపెట్టినా అది ఎవరికో ఒకరికి నష్టం కలిగిస్తుంది. ఆఖరికి గదిలోని బూజులు దులిపినా సాలె పురుగులకు బాధ. అంచేత యథాస్థితికి భంగం రాకుండా ''క్రమక్రమంగా'' మార్పులు రావాలని వారి వాదన.

కాని కాలపరిణామం మనకోసం ఆగదు. నెహ్రూ హెచ్చరించినట్లు ప్రపంచమంతా నానాటికి సన్నిహితమౌతున్న సమయంలో మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. ప్రపంచంలోని వివిధ దేశాల మధ్య భౌగోళికంగా ప్రకృతి సిద్ధంగా ఉన్న అడ్డంకులన్నీ తొలగిపోయి ఏక ప్రపంచం రూపొందుతున్న సమయం ఇది. యుగయుగాలక్రితం ఎన్నడో మనకి అణువిచ్ఛిత్తి తెలుసుననీ రామాయణ కాలంలో విమానాలుండేవనీ సంతృప్తిపడితే నేడు మన కొరిగేదేమీలేదు. విమానాన్ని నిర్మించడం ఎలాగో నేడు మనకి తెలియగలిగి ఉండాలి. నేడు మనల్ని పీడిస్తున్న ఆర్థిక, సాంఘిక సమస్యలను ఆధునిక పరిష్కారమార్గాల సాధించదల్చుకున్నానాడే మనకు ముక్తి. పురాణయుగం సంగతేమోకాని, నేడు ఇండియా జనాభా 360,000,000. ఈ జనాభా సంవత్సరానికి 5,000,000 చొప్పున హెచ్చుతూ పోతున్నది. ఈ జనాభా సంఖ్య విజృంభణను అరికట్టడం నుండి వృథాగా సముద్రంలోకిపోతున్న నదీజలాలను అరికట్టి వినియోగించుకునే వరకు మనకు అన్నీ సమస్యలే. అన్ని రంగాలలోనూ కూలంకషమైన మార్పులు వస్తే తప్ప ఒక జాతిగా మనం పురోగమించలేమని నెహ్రూ తహతహ. అన్ని మార్పులకూ కీలకం ఆర్థిక రంగంకనక సామ్యవాద సమాజ స్థాపనకోసం ఆయన ప్రయత్నిస్తున్నారు.

అటువంటి సమాజం రూపొందాలంటే తీర్మానాలను ఏకగ్రీవంగా

ఆమోదిస్తే చాలదు. సాంఘిక వ్యవస్థలో ఉన్న కుల, మత విభేదాలు, ప్రాంతీయ విద్వేషాలు, భాషా దురభిమానాలు ముందు తొలగాలి. ఆర్థిక వ్యవస్థలో వేడున్న భయంకర వ్యత్యాసాలు పైదొలగి సాంఘిక సంక్షేమానికి ప్రాతిపదిక ఏర్పడాలి. దానికి దేశంలోని బలవత్తరమైన అన్ని వర్గాల సహకారమూ అత్యంతావశ్యకం. ఆ సహకారం లభించిననాడు ఆర్థిక, సాంఘిక రంగాలలో శాంతియుతమైన విప్లవాన్ని సాధించి ప్రజాస్వామిక రీతిలో నవసమాజాన్ని నిర్మించుకోగలం. ఆర్థిక దారిద్ర్యం, మనిషికీ, మనిషికీ మధ్య విపరీతమైన సాంఘిక వ్యత్యాసాలు, ఉన్నత వర్గాలలో అవినీతి—యీ మూడే ప్రపంచంలోని ఏదేశంలోనైనా విప్లవానికి దారితీశాయని డాక్టర్ రాధాకృష్ణన్ మొన్న ఆళ్వారులో హెచ్చరించారు. ఆ ప్రమాదం రాకుండా స్వచ్ఛందంగా సామ్యవాద సమాజ స్థాపనకు అన్ని వర్గాలూ తోడ్పడడం శ్రేయస్కరమని నెహ్రూ పదే పదే హెచ్చరిస్తూ తన కృషి సమస్తాన్ని అటువైపు కేంద్రీకరిస్తున్నారు. తన జీవిత కాలంలోనే అటువంటి భారత దేశాన్ని రూపొందించాలని, ఆయన సంకల్పం. పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టడం అందుకొరకే; ప్రత్యేక వివాహాల చట్టం, స్త్రీల ఆస్తి హక్కులు, భూస్వామ్య సంస్కరణ, మరణ సుంకాల విధింపు అందుకొరకే; కంపెనీలచట్టాన్ని సమూలంగా మార్చేసి మేనేజింగ్ ఏజెంట్ల అధికారాలను పరిమితంచేసి వారి వార్షికాదాయం యిరవైవేలకు మించకుండా చేయడం అందుకొరకే. అందుకే యింపీరియల్ బ్యాంకును ప్రభుత్వం స్వాధీనం చేసుకుని, స్టేట్ బ్యాంకుగా మార్చడం కూడా అందుకొరకే. సమాజాన్ని ధనస్వామ్యం గుప్పెటనుండీ తప్పించి ప్రజాస్వామికమైన ఆర్థిక, సాంఘిక న్యాయం నెలకొల్పడానికి నెహ్రూ అహర్నిశలూ కృషి చేస్తున్నారు. అన్ని వర్గాలూ సహకరించవలసిందని ప్రబోధిస్తున్నారు. 'జీవితపు ఆఖరి ఘట్టంలోకి వచ్చాను. మిగిలిన జీవిత కాలాన్ని ఇండియా పునర్నిర్మాణం కోసం వినియోగిస్తాను'' అని పండిత నెహ్రూ అంటే ఉద్వేగంతో అర్థంకాని భారత హృదయం ఉండదు. చరిత్ర గమనంతోపాటు ఇండియాను నడిపించాలని ఆయన ఉత్కంఠ. ఆయన వెనక ప్రజాస్వామ్యం యూపత్తూ ఉన్నది. నేటి యువక తరం ఆయన విశ్వాసాన్ని అవలంబనగా తీసుకుని పురోగమించాలని నాస్తున్నది. నేడు ఇండియాను పరిపాలిస్తున్నది కాంగ్రెస్ పార్టీ. ఆ పార్టీ ఏకైక నాయకుడు నెహ్రూ. పతే యింక నెహ్రూ పురోగమనానికి అవరోధం ఏమిటి? యువకతరంలో క్రమశిక్షణ లేదనీ, వారిలో అసభ్య ప్రవర్తన పెచ్చు పెరిగిపోతున్నదనీ, నెహ్రూ మొన్న మద్రాసులో హెచ్చరించారు. వాస్తవం కావచ్చు. కాని యువతరంలో అంత నిస్పృహకు, నైరాశ్యానికి కారణం ఏమిటని ప్రశ్నించుకుంటే, అట్టడుగున అభ్యుదయ నిరోధకశక్తుల మంకుతనం యువక లోకాన్ని చాలా నిస్పృహలోను చేస్తున్నదని తేలుతుంది. కాంగ్రెస్

పార్టీ పెద్దలలోనే, రాష్ట్ర ప్రభుత్వాలకి సారథ్యం వహించే శక్తులలోనే అడుగడుగునా నెహ్రూకు అడ్డుతగిలే వరాలున్నాయి. "పండిత నెహ్రూను అనుసరించండి', అని ఎలుగెత్తి అరిచే రాష్ట్ర నాయకుడే ఆచరణలో పరమ కులతత్వవాది; ప్రాంతీయతత్వవాది "సామ్యవాద సమాజ వ్యవస్థా నిర్మాణానికి తోడ్పడండి" అని గంభీరోపన్యాసం యిచ్చే మంత్రిగారు అంతర్యంలో ధనస్వామ్యానికి కావలిబంటు. ఇలాంటి వారంతా కాంగ్రెసు పార్టీలో సమృద్ధిగా ఉన్నారు; మాటలలో నెహ్రూకు జేజేలు పలికి ఆచరణలో ఆయన ఆశయాలన్నిటికీ అడ్డు తగులుతారు. యువకతరంలో కంటే క్రమశిక్షణారాహిత్యం, అసభ్యప్రవర్తన వీరిలో పదింతలున్నవి. ప్రజాస్వామ్య జీవన విధానం అంటే ఏమిటో ఎన్నడూ ఎరుగని వీళ్ళు, మార్పంటే ఉడుకుకునే వీళ్ళు, యువకతరంలో చెప్పలేనంత నిరుత్సాహాన్ని రేకెత్తిస్తున్నారు. కాని వీళ్లే నేడధికారంలో ఉన్నారు. ఈ అధికారంతో అన్ని రంగాలలోనూ చెడుగుడు ఆడుతున్నారు. విద్యారంగాన్ని అయోమయం చేసిపెట్టి "మీకు చదువు రావడం లేదు" అని కుర్రాళ్ళని కోప్పడుతున్నారు. ఒక చెంప యువకలోకం నిష్కారణంగా గోవా యజ్ఞంలో ప్రాణాలర్పిస్తే, కాలాన్ని వెనక్కు మళ్ళించే వీళ్ళు గోవాకోసం యజ్ఞగుండంలో నెయ్యి అర్పించారు. ఈ ప్రతీపశక్తులన్నిటినీ సక్రమంగా నెహ్రూ అదుపులోకి తీసుకరాగలిగిననాడు యువకతరంలోనే కాదు; దేశంలోని అభ్యుదయ వర్గాలన్నింటిలోనూ నవచైతన్యం వెల్లివిరుస్తుంది.

-)o(-

—తెలుగు స్వతంత్ర
(అక్టోబరు 7, 1955)

ప్రతాపరుద్రీయంలో పేరిగాడి పాత్ర నవ్వు కలిగిస్తుందని కొందరి భావన.

కాని పేరిగాడి ఉద్దేశం మనకు నవ్వు తెప్పించాలని గాదు; జీవితాన్ని పేరిగాడు నవ్వులాటగా తీసుకోలేదు. అతడు చాలా సీరియస్ మనిషి. అతని తాత్త్విక చింతన అతనికుంది; నైతిక విశ్వాసాలలోగూడ గట్టివాడు. వెకిలితనాన్ని సుతరామూ అంగీకరించడు. రాజసభలో పేరిగాడు వింతపేరోలగంతో

కొలువు తీర్చి ఉండగా రాజనర్తకి ప్రవేశించిన ఘట్టాన్ని తీసుకుందాం. "ప్రభూ! నాట్యకత్తె వచ్చినది. ఆమెమని ఆజ్ఞ?" అంటాడు జనార్దన మంత్రి. "కత్తేటి? కత్తి ఆడుద్దా?" అని విస్తుబోతాడు పేరిగాడు. ఎలాగైతేనేం నర్తకి నృత్యం ప్రారంభిస్తుంది; మార్దంగికుడూ ఆమె ననుసరిస్తూ, పదాభినయానికి అనుగుణంగా మృదంగం వాయిస్తాడు. కొద్ది క్షణాలు చూసి పేరిగాడు "ఆపండోస్!" అని అరుస్తాడు. నృత్యం ఆగిపోతుంది. మార్దంగికుణ్ణి చూసి "ఏటది, నువ్వు మెళ్ళో ఏదో ఎంకటయ్య కడుపులాగ ఏలాడేసుకుని 'టమా' అంటావు, 'టముటమా' అంటావు! కుర్రది బెదిరి గంతులేస్తోంది. ఆడపిల్లనలా యిడుపిస్తావా! కాలేదు, నువెళ్ళి ఆ మూల కూకో. ఏమే పిల్లా — నువ్వు ఈ మూల కూకో! — ఈ సారి ఆడు నాట్యం!" అంటాడు పేరిగాడు. ఆడపిల్లల్ని భయపెట్టడం అంటే అతనికంత దుర్భరం. తన సమక్షంలో ఏట్టి అవినీతినీ, ఎట్టి దుశ్చారంనూ సహించడు. పేరిగాడు ఆదర్శ ప్రభువు. తన పాలన కింద ఉన్న ప్రజానీకపు నీతివర్తన గురించి అతనికంత శ్రద్ధ; దురదృష్టవశాత్తూ అవి రాజరికపు రోజులయిపోయాయిగాని, లేకుంటే అతడొక ప్రజానాయకుడిగా రూపొంది తను నమ్మిన "భారతీయా" సంస్కృతి కాపాడి ఉండేవాడే.

కలకత్తా యూనివర్శిటీ అధికారులు ఈ మధ్య నొక కొత్త నిబంధనను ప్రవేశపెటారు. యూనివర్శిటీలో విద్యార్థులు ప్రదర్శించే నాటకాలలో యిక ముందు స్త్రీ పాతలు స్త్రీలు ధరించకూడదు. అంటే విద్యార్థినులందరూ కలిసి ప్రత్యేకంగా నాటకాలు ప్రదరించవచ్చు. అలాగే విద్యార్థులు. అంటే అంతా వేర్వేరుగా ఉండాలి గాని యువతీయువకులు కలసి నాటక ప్రదర్శనంలో పాలొనకూడదు. కారణాల వివరణ లేదుగాని, యూనివర్శిటీ అధికారులలో ఏ మహాత్ముడికో అటువంటి నిబంధన అత్యవసరం అని అనిపించి ఉండవచ్చు. ఒకరికి అలా అనిపించాక తక్కిన పెద్దల ఆమోదం దొరకడం చిటికెలో పని. యువతీ యువకుల క్షేమంకోసం, వారిని బాగుచేసి ఉత్తమ పౌరులుగా తయారుచేసి వాళ్ళద్వారా 'భారతీయా' సంస్కృతిని పరిరక్షించడం కోసం నేడు అధికారంలో ఉన్న పెద్దలు ఎటువంటి కష్టాలనైనా ఎదుర్కొని ఎంతటి త్యాగమైనా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళకి కావలసింది మన పిల్లలకు బాగుపడడం. వాళ్ళ నీతినియమాలు ఉన్నతస్థాయిన ఉండడం. యూనివర్సిటీలో చదువుకునే యువతీ యువకులు కలసి నాటక ప్రదర్శనలలో పాలొంటే అందులో ఏదో ప్రమాదం ఉండి ఉండాలి. అదేదో "భారతీయా సంస్కృతి"కి వ్యతిరేకం ఐయుండాలి, అందుకే యూనివర్శిటీ అధికారులు, "విద్యార్థులూ మీరు ఆ మూల ఉండండి: విద్యార్థినులూ — మీరు యీ మూల ఉండండి. ఈ పాలి ఆడండి నాటకాలు." అన్నారు.

ఏ యూనివర్సిటీ విద్యార్థులూ (అనగా విద్యార్థినులు కూడా) సమాజాలు స్థాపించి ప్రవృత్తిగా నాటకాలాడారు. ఏ కాలేజీ వార్షికోత్సవానికో, వర్ధంతికో, సంస్కృతీ సమావేశానికో ఏర్పరచుకున్న కార్యక్రమంలో నాటక ప్రదర్శనం ఒకటిగా చేయిస్తారు. అందుకు తగిన నాటకాన్నే ఎనుకుంటారు; కాని, కలిసి ప్రదర్శించడానికి ఎబ్బెట్టుగా ఉన్న నాటకాన్ని ఎన్నుకోరుగదా! విద్య అంటే కేవలం పరీక్షార్థం పుస్తక పఠనమే గాక, సర్వతోముఖమైన వ్యక్తిత్వ వికాసం చెందడం కాబట్టే, ఆధునిక విద్యా శిక్షణలో ఆటలు, వక్తృత్వపు పోటీలు సాంస్కృతిక కార్యకలాపాలు—వీటికంత ప్రాముఖ్యం యివ్వబడుతున్నది. విద్యా శిక్షణ పద్ధతులలో నిరంతరం పరిశోధన జరుగుతోంది; ఆధునిక విజ్ఞానానికంతటికీ యువతీ యువకుల్ని వారసులుగాచేసి, వారిలో వైజ్ఞానిక దృక్పథం పెంపొందింపజేసి, యీ శతాబ్దపు జీవనంలో సమాజం యిచ్చే సవాళ్ళను సక్రమంగా ఎదుర్కొనగలిగే శక్తిసామర్థ్యాలు, మానసిక పాటవం, సమ్యక్ దృష్టి యువతీ యువకులకు అలవడాలని ఒక చెంప అభ్యుదయ నాయకులు ప్రయత్నిస్తున్నారు. కేంద్ర ప్రభుత్వపు ఆధ్వర్యాన "యూత్ ఫెస్టివల్స్" నడుస్తున్నవి. "యుగ ప్రభావాన్ని అర్థం వైజ్ఞానిక దృక్పథాన్ని పెంచుకొండి. జీర్ణించి శిథిలమైన పాత వ్యవస్థ పద్ధతులలో ఆలోచించడం కట్టిపెట్టి, సుస్థిరమైన భవిష్యత్తుకోసం తక్కిన ప్రపంచంతోపాటు అడుగువేయండి" అని శ్రీ నెహ్రూ నిరంతరం పాడేపాట, "ప్రపంచం ముందుకెళుతుంటే మనమింకా గోమయం యుగంలోనే ఉన్నాము!" అని ఆయన ఈ మధ్య అన్నాడంటే, వెనకచూపుగాళ్ళు ఆయన దారికి ఎంతగా అడ్డుపడుతున్నాడో అర్థమౌతుంది. అటువంటివాళ్ళు ఆయన కృషికే కాదు, దేశాభ్యుదయానికీ అడుగడుగునా అడ్డు తగులుతారు. ఏది చూసినా ఏది తలుచుకున్నా వాళ్ళకి భయమే. వృద్ధత్వానికి మొదటి లక్షణం యువదృష్టిని భరించలేకపోవడం. తమ కళ్ళఎదుట పాత వ్యవస్థ కూలిపోతుంటే భరించలేరు. యువత అంటే బొత్తిగా అపనమ్మకం. చెయ్యవలసిన కట్టుదిట్టాలన్నీ చెయ్యకపోతే యువకలోకం చెడిపోతుందని వాళ్ళ భయం. మళ్ళీ యుగ ప్రభావాన్ని ఆపలేరు. ఒక నవసమాజాన్ని నిర్మిద్దామని నెహ్రూచేసే ప్రయత్నాలను బహిరంగంగా ఎదుర్కొనలేరు. కాని ఎక్కడికక్కడే అడ్డుగోడలు వేద్దామని వ్యర్థ ప్రయత్నాలు చేస్తుంటారు. "సినీమాలు చూడకండి, చెడిపోతారు!" అంటారు. (ఈ మధ్య ధేబర్‌గారు అలా అన్నారు కూడా.) కలకత్తా యూనివర్సిటీ అధికారులు "కలిసి చదువుకుంటే చదువుకున్నారుగాని కలిసి నాటకాలు వేయకండి!" అని హుకుమ్‌లు జారీ చేస్తారు. శాంతినికేతాన్ని టాగూరు అక్కడే నడిపి, లలితకళలకూ, సృజనాత్మక కృషికి ఎనలేని దోహదం ఇచ్చాడు. నాటకకర్తగా ఎన్నో నాటకాలు వ్రాసి తన విద్యార్థులచేత ఆడించాడు. యువతీ యువకుల్ని ఒక మహదాశయంవైపు నడి

పించడానికి నిరంతరం కృషిచేసి, యువతను విశ్వసించి వాళ్ళలో నవచైతన్యం అంకురించడానికి దోహదపడ్డాడుగాని, పై యూనివర్సిటీ అధికారులే భయపడలేరు. ఇవాళ టాగూరు సంగతి సరే, రామమోహన్‌రాయ్ సహగమనాన్ని మాన్పించినందుకు విచారించే పెద్దల సంఖ్య ఎక్కువవుతున్నది.

పై ఉదంతమొక ఏకాకి సంఘటన కాదు. ఒక రకపు మనస్తత్వానికి చిహ్నం అది. 'శాసనం ద్వారా నీతిస్థాపన' అనేది వాళ్ళ సంకల్పం. పాపం, ప్రజలు సినిమాలు చూస్తే నీతి చెడతారని వాళ్ళగట్టి భయం. కాని సినిమాలను ఒక పరిశ్రమగా నిర్మూలించలేరు. అదీ చెయ్యాలనే వాళ్ళకుందిగాని మళ్లీ అంత ధైర్యం లేదు. అంచేత చిత్ర నిర్మాణం మీద వీలయినన్ని నిషేధాల్ని పెట్టి, చిత్రాలలో ప్రజలు చూసి ఆనందించి చెడిపోతారేమోననే భావాలను కత్తిరించి మరీ వదులుతారు. "మన పూర్వకాలపు గొప్పదనాలను చూపించే చిత్రాలు తీయండి. పురాణాల్లోని నీతివంతమైన కథలు చిత్రంగా తీయండి" అని హెచ్చరిస్తుంటారు. సినిమా సంగీతాన్ని నిషేధించి, కేవలం శాస్త్రీయ సంగీతాన్నే రేడియో ద్వారా వినిపిస్తుంటారు. జనం ఏరకం చిత్రాలు చూడాలి, సంగీతం వినాలి, సాహిత్యం చదవాలి. అనేవన్నీ నిర్ణయించి తమ కిష్టంలేనివల్లా నిషేధించి పారవేస్తారు. వారి ఆదుపాజ్ఞలలో లేవుగాని ఉంటే, ప్రజలు ఏం తినాలి, ఏం కట్టుకోవాలి (పచ్చి కొబ్బరికాయ మాత్రం తిని, అంగ వస్త్రాలతో సరిపెట్టుకుంటే మరీ మంచివి.) అనేవి కూడా శాసిస్తారు. ఇదంతా ప్రజల నుద్ధరిద్దామనే: వాళ్ళ నీతి నియమాలను కాపాడి 'ఆదర్శప్రజ'గా రూపొందిద్దామనే. వాళ్ళ తాత్విక దృష్టిలో లలిత కళలన్నీ అవినీతి కరమైనవి. అలాగే నిరాడంబర జీవితం అంటే వాళ్ళిచ్చే అర్థం రసహీన, అర్థహీన, ఆనందరహిత జీవితం అని: ఆఖరికి భోజనం కూడా ఆప్యాయంగా తినడం అవినీతి బస్సులలో మెత్తని సీట్లు తీయించేయాలని ఆ మధ్య ముఖ్యమంత్రిగా ఉన్నపుడు రాజాజీ ప్రయత్నించారు. అంత వార్ధక్య దృష్టితో బాధపడేవాళ్ళే "అయ్యో లోకం చెడిపోతోంది!" అని ఏవేవో కొత్త ఫర్మానాలు జారీ చేస్తుంటారు. కాలగర్భంలో చివరకవి పేరిగాడి ఫర్మానాల్లాగే నవ్వులపాలౌతాయి.

-)0(-

—తెలుగు స్వతంత్ర
(అక్టోబర్ 28, 1955)

# ఆచార్యులకు శుభాకాంక్షలు

పత్రికా శీర్షికలో కాకపోయినా, క్రిందటివారం వార్తాపత్రికలలో ప్రచురింపబడిన ఒకవార్త వేలాది ఆంధ్ర హృదయాలను పులకాంకితం చేసింది. వర్తమాన ఆంధ్ర మహాపురుషులలో ఒకరైన ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్యగారికి డెబ్బది ఏళ్ళు నిండిన శుభసమయాన, హైదరాబాద్‌లో పలువురు పెద్దలు ఒక సన్మానసభ జరిపి, విద్యారంగంలో శ్రీ వెంకట రంగయ్యగారు ఆంధ్ర దేశానికి చేసిన సేవను ప్రస్తుతించారు. ఆచార్య శ్రీ వెంకట రంగయ్యగారికి డెబ్బైఏళ్ళు నిండి, జన్మదినం జరుపుకొన్నారన్న శుభవార్త పత్రాక శీర్షికలో వెలువడదగినది. ఒక అర్ధశతాబ్దంపాటు ప్రముఖంగా విద్యారంగానికి తమ జీవితం ధారపోసిన శ్రీ రంగయ్యగారి పేరు చెబితే చాలు వేలాది విద్యార్థుల, మాజీ విద్యార్థుల, తల్లిదండ్రుల, విద్యారంగపు శ్రేయఃకాముల హృదయాలు కృతజ్ఞతతో నిండిపోతాయి. మామిడిపూడివారనగానే సన్నని పొడుగాటి విగ్రహం, చక్కని దేహచ్ఛాయ, బ్రహ్మవర్చస్సు తొణికిసలాడే కోలమొహం, ప్రశాంతత, ఆప్యాయత తొణికిసలాడే కన్నులు, మధురమైన వాక్కు వీటితో మనకు రంగయ్యగారు కళ్ళముందు సాక్షాత్కరిస్తారు. అప్రయత్నంగా చేయెత్తి భక్తిగౌరవాలతో నమస్కరిస్తాము. రంగయ్యగారిని సన్మానించడమంటే, ఆంధ్రదేశంలో విద్యారంగాన్నే, ఆంధ్రసరస్వతినే సన్మానించడమన్నమాట.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజకీయశాస్త్ర అధ్యాపకుడుగా, సిండికేట్, సెనేట్, కౌన్సిల్ సభ్యుడిగా శ్రీ రంగయ్యగారు ఎనలేని సేవచేసి, క్రొత్త ప్రమాణాలు నెలకొల్పారు. తదుపరి కొన్ని కళాశాలల ప్రిన్సిపాలుగా, బొంబాయి యూనివర్సిటీ రాజకీయ శాస్త్రాధ్యయన విభాగపు అధ్యక్షుడిగా, ఆలిండియా రేడియో విద్యా కార్యక్రమాల సలహాదారుగా విద్యారంగానికి ఓపినంత సేవ చేశారు. ఏ కార్యక్రమం నిర్వర్తించినా, ఏ హోదా చేపట్టినా, తన మేధా సంపత్తిచేత ఆ కార్యక్రమానికి వన్నెతేగల ప్రతిభాసంపత్తి ఆయనది. బహుళ గ్రంథకర్త; చరిత్రకారుడు; రాజ్యాంగ శాస్త్రీయవేత్త, విజ్ఞాన ఖని, బహుముఖ ప్రజ్ఞావంతుడు గనక, నిజమైన పండితుడు గనక, గర్వం, దర్పం, ప్రదర్శించవలసిన అవసరం ఆయనకు యీషణ్మాత్రమూ లేదు. వినయశీలి, మితభాషి. కాని తను నమ్మిన విశ్వాసాలను, తనకు తోచిన సత్యాలను ధైర్యంగా వెలువరించగల ఆత్మవంతుడు. పాఠ్యగ్రంథాల జాతీయకరణ విద్యారంగానికి హాని చేస్తుందని గ్రహించిన వెనువెంటనే ప్రభుత్వ కమిటీనుండి తను వైదొలగిన యిటీవల ఉదంతం ఆయన చిత్తశుద్ధికి ఒక ఉదాహరణ మాత్రమే.

ఆంధ్రదేశంలో నిజమైన మేధావులు చాలా తక్కువ; వారిలోనూ చిత్తశుద్ధిగలవారు యింకా తక్కువ. రాజకీయ వలయాలకు దూరంగా ఉంటూ ప్రశాంతంగా, నిబ్బరంగా, నిష్పాక్షికమైన వైజ్ఞానిక దృష్టితో ఆయా సమస్యలను పరిశీలించగలిగే ఓర్మి, ఆసక్తి ఉన్నవారు శ్రీ వెంకట రంగయ్యగారొక్కరేమో ననిపిస్తుంది. ఆయన దృష్టి చరిత్రకారుడిది గనుక నడుస్తున్న చరిత్రను ఉద్రేకం తెచ్చుకోకుండా వ్యాఖ్యానించగలరు; రాజకీయశాస్త్ర నిష్ణాత గనక, ఏ "యిజా"నికీ ఆయన హృదయం తాకట్టుపోలేదు. అన్ని "యిజా"లనూ సమభావంతో చూడగల సమ్యక్ దృష్టి ఆయనకున్నది. పరిశీలనలో కుశాగ్రబుద్ధి గనక విశదీకరణలో శమపడరు. ఆంధ్రాంగ్ల భాషల రెండింటిలోనూ ఆయన శైలి సరళంగా, సాఫీగా. అన్వయ కాఠిన్యం పులుముడు లేకుండా సాగిపోతుంది. "పొసగ ముత్యపుసరుల్ సోహళించిన" రీతిగ వాక్యం తరువాత వాక్యం పేర్చి అరటిపండు వొలచినంత తేటతెల్లంగా, విషయం మనకు సుబోధకమయేట్లు చేయడంలో శ్రీ రంగయ్యగారు సిద్ధహస్తులు. ఆయన శైలిలో అలంకారాలు, డొంక తిరుగుడు శాఖాచంక్రమణం- ఎక్కడా గోచరించవు. ఇంగ్లీషులో శాస్త్రవేత్త జె. బి. ఎస్. హాల్డేన్ శైలి ఎంత సరళమైనదో, తమిళంలో రాజాజీ శైలి ఎటువంటిదో, తెలుగులో ఇంగ్లీషులో శ్రీ రంగయ్యగారి శైలీ, వివరణ పద్ధతీ అటువంటివి.

డెబ్బైయేళ్ళు నిండినా శ్రీ రంగయ్యగారికి మానసికంగా వార్ధక్యం రాలేదు. నిత్య పల్లవ శీలమైన మేధస్సు ఆయనది. చాలామంది మేధావులు ఒక ఘట్టం గడిచాక యింక ఎదగరు. మానసికంగా ఘనీభవించి పోతారు. అలాకాకుండా శ్రీ రంగయ్యగారు నిరంతర విద్యార్థిగా విషయ పరిశీలన చేస్తారు. జ్ఞానాన్వేషి. అందువల్లనే యువతరాన్నికూడా అమితంగా ఆకర్షించగలరు. ఇరవై ఏళ్ళ యువకుడు కూడా ఆయనతో గంటలకొద్దీ హాయిగా మాటాడగలడు. ఆయనతో సంభాషణ చందన చర్చవంటిది. పరుషవాక్కు ఎరగని సౌమ్యమూర్తి ఏభై సంవత్సరాలు నిర్విరామకృషి చేసినా, ఆయన లేఖిని యింకా విశ్రాంతి నెరుగదు. తెలుగు విద్యార్థిలోకంపట్ల ఆయనకు గల వాత్సల్యం ఎటువంటిదో "తెలుగు విద్యార్థి" మాసపత్రిక పుటలు రుజువు చేస్తాయి. ప్రతిఫలాపేక్ష లేని సేవానురక్తి అది.

ఆంధ్రదేశంలో రఘుపతి వెంకటరత్నం నాయుడు, సి. ఆర్. రెడ్డి గార్ల తర్వాత అగ్రగణ్యులైన విద్యావేత్త శ్రీ వెంకట రంగయ్యగారు. అట్టి మహనీయుని కృషిని ఎలా ఉపయోగించుకోవాలో తెలియని రాష్ట్ర ప్రభుత్వం దాపురించడం ఆంధ్రుల దురదృష్టం. కవి యశఃప్రార్థులైన కూటాలన్నింటికీ హడా

విడిగా హాజరయే మంత్రిసత్తము లెవరికీ వెంకట రంగయ్యగారిని సముచితరీతిని సత్కరించడానికి వ్యవధి ఎలాగూ లేదు గనక, సహృదయులైన ఆంధ్ర మహాజనులే ఆ పనికి పూనుకోవలసి ఉంది. రంగయ్యగారివంటి విద్యాదాతకు, విజ్ఞాన తపస్వికి అది అవసరమని కాదు. కాని, జాతి పురోగమనానికి కరదీపిక వెలిగించి వెలుగు చూపుతున్న మేధావులను పోల్చుకుని సత్కరించడం జాతికే విద్యుక్తధర్మం. అదలా ఉంచి, డెబ్బదవ జన్మదినోత్సవం జరుపుకొన్న ఆచార్య శ్రీ వెంకట రంగయ్యగారు. శతవర్షపు జన్మదినం గూడా జరుపుకొందురుగాక అనీ, భావితరాల విద్యార్థులకు కూడా ఉపదేశికులవుదురుగాక అనీ, నిండు హృదయంతో ''స్వతంత్ర" అభిలషిస్తున్నది.

—"తెలుగు స్వతంత్ర''
-జనవరి 24, 1959.

గోదావరి మండలం అన్నివిధాలా సారవంతమైనది. కాటన్‌దొర గోదావరికి ఆనకట్ట కట్టిన తరువాత మాగాణితాలూకాల్లో బంగారు పంటలు పండాయి. మధ్యమ తరగతి గృహస్థుల సిరిసంపదలు పెరిగి జీవితానికొక స్థిమితత్వం, భద్రత ఏర్పడాలి. గోదావరీ జలం మెదడుకు చురుకుదనం కలిగిస్తుందని ప్రసిద్ధి. సారవంతమైన భూములూ, సంస్కారులైన ప్రజలు. ఈ శతాబ్దారంభంలో అక్కడ అన్నిరంగాలలోనూ వైతాళికులుద్భవించి అంతఃరకు నిద్రాణంగా ఉన్న జాతిని మేల్కొలిపారు. రాజమండ్రి పట్టణానికి కొత్త ప్రాముఖ్యం వచ్చింది. రాజకీయ రంగంలో శ్రీ న్యాపతి సుబ్బారావుగారు, సంఘసంస్కరణ రంగంలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారు, సాహిత్యరంగంలో తిరుపతి వేంకటేశ్వర కవులు—యిలా ఎందరో ఆనాడు ఆంధ్రజాతికి కొత్త అధ్యాయం తెరిచారు. టంగుటూరి ప్రకాశంగారి రాజకీయజీవితానికి నాంది రాజమండ్రిలోనే జరిగింది. తరువాత తరం యువకులకు వీరందరూ ఆదర్శమూర్తులైనారు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసి భారత రాజకీయరంగంలో గాంధీజీ అడుగుపెట్టేవేళకు గోదావరిమండలం అన్నివిధాలుగా చైతన్యవంతంగా ఉంది. అప్పుడు శ్రీ కళా వెంకట్రావుగారు కాకినాడ కాలేజీలో విద్యార్థి. ఆ యువకుని స్వస్థలం కోనసీమలోని ముక్కామల. కాలేజీలో ఆ యువకునికి సహచరులు శ్రీ మొసలికంటి తిరుమలరావు, శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య మొదలైనవారు. ఇటు రాజమండ్రిలో యించుమించు ఆయన తరానికి చెందినవారు శ్రీ (స్వర్గీయ) డాక్టరు సుబ్రహ్మణ్యం, శ్రీ క్రొవ్విడి లింగరాజు మొదలైన యువకులు. 1921లో గాంధీజీ

పిలుపువిని సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్న విద్యార్థి కళా వెంకట్రావు-1959 మార్చి 28న హైదరాబాదులో శాశ్వతంగా కన్నుమూశారు. అప్పుడాయన ఆంధ్రదేశపు రెవెన్యూ మంత్రి. ఆయన భౌతికదేహానికి స్వగ్రామం ముక్కామలలో రాజ్యలాంఛనాలతో అంతిమ సంస్కారం జరిగింది.

మధ్యలో ఆయన జీవితమంతా రాజకీయాల్లోనే గడిచింది. అదీ కాంగ్రెస్ సంస్థలోనే. స్వాతంత్ర ప్రియుడుగా, త్యాగిగా, యోధుడిగా ప్రతి ఉద్యమంలో పాల్గొంటూ మొత్తం జీవితకాలంలో ఎనిమిదేళ్ళు జైలులో గడిపారు. పార్టీలో అనేక పదవులు సామర్థ్యంగా నిర్వహించారు. చాలాకాలం రాష్ట్ర కాంగ్రెస్ సెక్రటరీ. 1947 నుండే (అపుడపుడూ మినహాయిస్తే) మొదట మద్రాస్‌లో, పిమ్మట కర్నూల్లోనూ, ఆఖరున హైదరాబాదులో మంత్రిపదవి. రాజకీయాల్లో ఓటమిలోని చేదునూ, గెలుపులోని తీపినీ రెండిటినీ చవిచూచారు. ప్రజలు అభిమానించి ఆయనకు బ్రహ్మరథం పట్టిన ఘట్టాలూ ఉన్నాయి. ప్రజలు ఆగ్రహించి ఆయనను తరిమికొట్టిన ఘట్టాలూ ఉన్నాయి. రెండిటినీ ఆయన సమభావంతో స్వీకరించినట్లనిపిస్తుంది. మంచినీటిచెరువుకు చేప ఎక్కినంత అవలీలగా, సామర్థ్యంతో, రాజకీయ వ్యాపారంలో ముప్పై అయిదేళ్ళకు పైగా విహరించారు. రాజకీయాలే ఊపిరిగా బ్రతికారు. ప్రతి ఘట్టంలోనూ "సమర్థుడు", "చతురమతి", "ప్రజ్ఞాశాలి" అని అర్థులూ, ప్రత్యర్థులూ ఏకాభిప్రాయంతో అంగీకరించారు. రాజకీయరంగంలో ప్రత్యర్థులుండని వారెవరు? ఆ రంగంలో ఉంటూ "అజాతశత్రువు" అనిపించుకోగల్గిన అదృష్టం ఏ డాక్టర్ రాజేంద్రప్రసాద్ వంటి పుణ్యమూర్తికోగాని పట్టదు. కాని ప్రత్యర్థుల చేత సైతం "సెహబాస్" అనిపించుకోగల్గిన అదృష్టం కూడా ఎందరికో పట్టదు. అట్టి కొద్దిమందిలో శ్రీ కళా వారొకరు. రాజకీయాలు ఆయనకొక చదరంగపుటాట. గెలవగలిగే ప్రతిభా చాతుర్యమూ ఉండేవి కనక గెలవాలనే పట్టుదల ఉండేది. ఆట ముగిసి బలగం మూసేసిన తరువాత ప్రత్యర్థులతో ఆయనకు మరింతగాయిదా లేదు. విజిగీషలోని మాధుర్యం ఒక్కటే ఆయనకు కావలసినది. అందులో స్వార్థం లేదు. అందుకే రాజకీయాలు మినహాయిస్తే వ్యక్తిగతంగా ఆయనది నిరాడంబరమైన నిష్కళంక జీవితం. ఆర్థికంగా స్వతంత్ర జీవితానికి కావలసినది-ఉన్నపాటి స్థితిమంతుడు మాత్రమేగాని ధనవంతుడుకాడు. ఐనప్పటికీ, ముప్పైఅయిదేళ్ళ రాజకీయ జీవితం తరువాత కూడా ఆయన స్వంతఆస్తి దమ్మిడీ పెరగలేదు. అంత నిగ్రహంతో వ్యవహరించిన రాజకీయనాయకులు ఆంధ్రదేశంలో ఎందరున్నారు?

ఆంధ్రదేశంలో శ్రీ ప్రకాశం, పట్టాభిగార్ల పలుకుబడి తారాస్థాయిలో ఉన్నకాలంలో, ఆ యిద్దరూ ఒకరినొకరు ప్రత్యర్థులుగా చూసుకునేవారు. శ్రీ కళా

వారు కొంతకాలం ప్రకాశం శిష్యుడు. మరికొంతకాలం పట్టాభి అనుచరుడు. అప్పట్లో యీ స్పర్థలవల్ల ఆంధ్రదేశం రాజకీయంగా చాలా నష్టపోయింది. 1945–46లలో ప్రకాశం మీద ఫిర్యాదులు గాంధీజీ దాకా వెళ్ళి దుమారం లేవదీశాయి. వాటి పర్యవసానమే 1947లో ప్రకాశంగారి పతనం. అది ఆయన పతనంతోనే ఆగక ఆంధ్రరాజకీయాలే ఛిన్నాభిన్నమై తమిళ రాజకీయ నాయకుల చేతుల్లోపడి నలిగిపోయింది; ఆ పరిస్థితినుండి 1953 వరకూ మనం కోలుకోలేకపోయాం. అదైనా పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణవల్ల. అదంతా గత చరిత్ర. కాని చరిత్ర గడిచిపోయినా, జాతియొక్క సామాజిక చైతన్యంలో కొన్ని స్మృతి చిహ్నాలు మాత్రం నిలిచిపోతాయి—వ్రణకిణాంకాలవలె.

ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో రెవెన్యూ మంత్రిగా శ్రీ కళావారు శ్లాఘనీయమైన సేవచేసి ఘనవిజయాలను సాధించారు. అత్యంత సమర్థులైన పరిపాలనాదక్షులనిపించుకుని చతురమతులైన తమిళ ఆఫీసర్లను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తారు. జమీందారీ రద్దు చట్టాన్ని తన ఒక్కడి చేతిమీదగా రూపొందించి, సంస్కరణలు ప్రవేశపెట్టి రైతులోకానికి శాశ్వతమైన మేలు చేకూర్చారు. పరిపాలనా యంత్రాంగం మీద శాశ్వతంగా తన ముద్రవేసి సర్వతోముఖమైన మన్నన పొందారు. రెవెన్యూశాఖ వ్యవహారాలలో ఆయన నిష్ణాతుడు. పరిపాలనా వ్యవహారాలలో ఏ ఆదేశాన్నయినా శ్రద్ధగా "స్టడీ" చేసిగాని ఆయన ఏ "ఫైలు" మీదా ఆర్డరువేయలేదు. నిశితమైన మేధస్సు తన శాఖల్లోని ఆఫీసర్లు త్రోవచూపి. అందులోంచి నడిచిపోయే రకంగాదు శ్రీకళావారు. ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే సూక్ష్మబుద్ధి. ఆయన ఆధిపత్యం కింద ఉన్న ప్రభుత్వశాఖల నిర్వహణలో జరగవలసిన న్యాయం జరగని ఘట్టాలు ఎక్కడైనా ఉంటే, కారణం కళావారి పాక్షికదృష్టికాదు; ఏమరుపాటు అంతకన్నాకాదు– ఆయన శక్తికిమించిన అదృశ్య రాజకీయ శక్తులేవో పనిచేశాయన్నమాట.

చివరి సంవత్సరాలలో శ్రీ కళావారి రాజకీయ పరిణత రాష్ట్రానికి ఎంతో అవసరమైనది. ఆయనలో ఒక సమ్యక్‌దృష్టి ఏర్పడి విభిన్న వర్గాలవారందరి అభిమానాన్ని చూరగొన్నారు. ప్రతిపక్షాలవారు, సోషలిష్టులూ, కమ్యూనిష్టులు అందరూ ఆయన సహాయాన్ని అర్థించి వీలయినంతవరకు పొందేవారు. కాకలు తీరిన రాజకీయవేత్త సర్వులకూ హితుడుగా ఉంటూ ఎందరో ఆర్తుల కృతజ్ఞతలు అందుకున్నారు రాజకీయదృష్టి వైదొలగి క్రమముగా ఒక విశ్వకారుణ్య దృష్టి ఏర్పడింది. గౌతమిపుత్రుడూ కాబట్టి గోదావరిలోని గాంభీర్యం ఆయనలో ద్యోతకమయేది. ఇంకా నాలుగు కాలాలపాటు మనమధ్యలో ఉండవలసిన వయస్సు కాని విధి అన్యథా తలంచింది. ఒక్కటే పరితృప్తి. జీవితంలో వలెనే మరణంలో

కూడా ఒకానొక అనిర్వచనీయమైన గాంభీర్యాన్ని విధి ఆయనకు ప్రసాదించింది. జీవితం నుండి స్వార్థంకోసం ఆయన తీసుకున్నది దాదాపు పూజ్యం: సంఘానికీ, జాతికీ ఆయన అందించిన వారసత్వపు సంపద అపారమైనది. అందుకే ఆయన ధన్యజీవి.

—"తెలుగు స్వతంత్ర"
—ఏప్రియల్ 4, 1959

# భావదాస్యం - జాతీయ సంస్కృతి

విశ్వవిద్యాలయాలస్నాతకోత్సవాలు వాటి ప్రాముఖ్యాన్ని ప్రయోజనాన్ని కోల్పోయి చిరకాలమైంది :- ఐనా, ఎన్నడో విదేశీయులు అలవాటుచేసిన వ్రతవిధానాన్ని మన యూనివర్శిటీలు తూచా తప్పకుండా పాటిస్తూంటాయి:- మాన్యులైన మేధావంతులూ, ఉన్నతపదవులలోని పెద్దలూ, స్నాతకోత్సవాల పేరిట, కొత్తగా డిగ్రీలు తీసుకున్న పట్టభద్రులకు హితబోధచేసి, జీవితంఅంటే ఏమిటో, యువతరం బాధ్యతలెటువంటివో తెలియచేస్తూంటారు :- తమ సిద్ధాంతాలను ఏకరువు పెడుతూంటారు :- పూనాయూనివర్శిటీ వార్షిక స్నాతకోత్సవం మొన్న జరిగింది — డాక్టర్ చింతామణి దేశ్‌ముఖ్‌గారు స్నాతకోపన్యాసం యిచ్చారు :- పరీక్షలలో ఉత్తీర్ణులై డిగ్రీలూ, డిప్లొమాలూ పొందిన సుమారు తొమ్మిది వేలమంది యువకులలో సగానికంటె తక్కువమంది మాత్రమే స్వయంగా హాజరై, డిగ్రీలు తీసుకున్నారట :- అత్యధికులు రాలేదుకనుక, ఉత్సాహం సన్నగిల్లిందని భావించరాదు :- సగానికి తక్కువ మంది అసలు రావడమే గొప్పవిశేషం. ప్రహసనాలస్థాయికి దిగజారిన నేటి స్నాతకోత్సవాలకు హాజరై నేర్చుకోవలసిన దేముంది?- పోనీ, వేడుకా వినోదం సౌభ్రాతృత్వభావం లభిస్తాయా అంటే, అదీలేదు. పొట్టకూటి చదువులు అలాంటివి నేర్పలేవు.

స్నాతకోపన్యాసంలో డాక్టర్ దేశ్‌ముఖ్‌గారు సమకాలీన పరిస్థితులు చాలావాటిని ప్రస్తావించారుగాని ఆయన ప్రసంగంలో "ప్రధానయితివృతం" అంటూ ఏదైనా ఉంటే, దానికి "సంస్కృతి బానిసత్యం" అని పేరుపెట్టాలి. ఎంచేతంటే. దానిగురించి ఆయన చాలా మాట్లాడారు. దాన్నితీసుకుని, తక్కిన అంశాలను అన్వయించారు. నేడు—అనగా అధునాతన కాలంలో—మన ముఖ్యాతిముఖ్య సమస్య ఏమిటి?- జరూరుగా మనకు కావలసిన దేమిటి?- ప్రపంచం

శీఘ్రగతిన అందులోనూ నఖశిఖపర్యంతమూ, మారిపోయిందన్నారు. నేడు మన దేశంలో వ్యక్తికి "సాంస్కృతిక బానిసత్వం" నుండి తత్‌క్షణం విమోచనం కావాలన్నారు. తన ప్రమేయమూ, నిర్ణయమూ లేకుండా ఒకానొక వర్గంలో బృందంలో, జన్మించినంతమాత్రాన, ఆ వర్గం తాలూకు సంస్కృతికి బానిసగా తయారై, అందులోనే జీవించ వలసిన దయనీయస్థితి పోవాలన్నారు. ప్రతిమనిషికి సాంస్కృతిక స్వతంత్రం లభించాలి. పాత సంస్కృతీ బంధనాలను ఛేదించుకుని యువకులు ముందుకుసాగాలని సూచించారు.

విప్లవానికి విజయం ఎప్పుడు - ఎలాంటి పరిస్థితులుంటే, సిద్ధిస్తుంది?- అని ప్రశ్నించుకుని జవాబు చెప్పారు. "సాంఘిక-ఆర్థిక'' ఏకత్వం ఉండే సమాజంలో విప్లవాలు రావడానికి ఎక్కువ అవకాశాలుంటాయి. సంస్కృతి పరంగా భిన్నత్వాలన్ని కలిసిపోయి ఏకత్వరూపాన్ని ధరించాలి. దానికి ఒక "కేంద్రబిందువు" ఉండాలి. అప్పుడే విప్లవాన్ని సాధించగలుగుతాము అన్నారు డాక్టర్ దేశ్‌ముఖ్. యివన్నీ చాలా బరువైన సిద్ధాంత విషయాలు. దేశముఖ్‌గారు విప్లవమూ, సంస్కృతీ బానిసత్వమూ, యిత్యాది పదాలు విరివిగా ఉపయోగించారుగాని వాటిని ఏ అర్థంలో వాడారో స్పష్టం చెయ్యకండా వదిలేశారు. దేశంలోని "కుల" వ్యవస్థను ఖండించారు. అలాంటి హానికర వ్యవస్థను రూపు మాపాలన్నారు. కులాలు నిర్మూలించాలని యివాళ సంఘంలో అందరూ అంగీకరిస్తారు. కులవ్యవస్థ వైదొలగాలి; ఆ సంగతి యివాళ కొత్తగా ఎవరూ చెప్పనక్కర లేదు; కులవ్యవస్థ పోవాలని అందరూ అంటారుగాని దాన్ని నిర్మూలించే మార్గమేమిటో యింతవరకూ ఎవరికి అంతు చిక్కలేదు. నిజంగా సంఘంలో అందరూ దాన్ని అసహ్యించుకుని రూపు మాపాలనుకుంటే అది ఏనాడో చచ్చేది. ఎవరికీ అక్కరలేనిది ఎలా బతుకుతుంది? అత్యధికులు దాన్ని ఆదరించి అనుసరిస్తున్నారు కనుకనే అది వర్ధిల్లుతున్నది. "ఒక వర్గంలో" జన్మించడం- దాని సంస్కృతికి బానిస కావడం- అని దేశ్‌ముఖ్ అన్నప్పుడు ఆయన కులతత్వం గురించి కాక, మరి దేనిగురించో ఆలోచించారనుకోవాలి ఎంచేతంటే, రెండూ వేర్వేరుగా చెప్పారాయన.

శ్రీ దేశముఖ్‌గారు ఓ వింత సిద్ధాంతాన్ని ప్రవచించారు. ముందుగా సంఘాన్ని మార్చనిదే సంస్కృతిని మార్చడం ఎన్నడూ ఎక్కడా సాధ్యం కాలేదన్నారు. సంఘాన్ని ముందు ఓ మూలకు లాగి దాన్ని విడిగా మరమ్మతు చేసి, ఆ తర్వాత సంస్కృతి మరమ్మతు చెయ్యాలంటే అర్థమేమిటి? సంఘాన్ని, సంస్కృతినీ విడదీయడం కుదరదు. సంస్కృతి అంటే అనేకానేక విలువల జీవన విధానాల ప్రేరణల సంపుటి. కొత్త సిద్ధాంతాల, విలువల, సూత్రాల, పరికరాలతోనే సంఘంలో మార్పులు తీసుకురావడానికి సాధ్యమవుతుంది. ఆర్థిక

వ్యవస్థలో చిన్న సంస్కరణ ప్రవేశపెట్టాలన్నా, ఆంతర్యంలో చివరకది కొత్త సాంస్కృతిక భావమే అవుతుంది. దేశముఖ్‌గారు అటునుండి యిటు తిరగేసి చెప్పారు. మొత్తం జాతీయ సంస్కృతి అంతా గత కాలానిదనీ, కాబట్టి దాన్ని అవతల పారెయ్యాలనీ చెప్పడం ''ఫ్యాషన్''గానే ఉంటుంది గాని, అలాంటిది ప్రయత్నించినా సాధ్యంకాదు. అది ఒక "జడవస్తువు'' కాదు. మనుషుల నడవడికనుండి విడదీసే దానికి ప్రత్యేకమైన ఉనికి లేదు. ఇక మనుషుల ప్రవర్తనా, ప్రేరణలూ అతడు జన్మించిన పరిసరాలూ "వర్గ" (అనగా దేశీయ జాతీయ) స్వరూపమూ వాటి ననుసరించి ఉంటాయి. వాటి ప్రభావం నుండి తప్పించుకోవడం ప్రపంచంలో ఏ దేశం ప్రజలకు కుదరదు. వాటిని తిరస్కరించిన మానవుడి ఎటువంటి విలువలూ అక్కరలేని ఒంటరిజీవి అవుతాడు. జాతీయ సంస్కృతినుండి "విమోచనం" పొందిన వ్యక్తులే సంఘ శత్రువులుగా పరిణమిస్తారు. "ఇది మన దేశం; మన వారసత్వం యిది; మన ఉత్తమ సాంస్కృతిక విలువలివి" అని గర్వంగా అనుకుని, వాటిని పాటించే వ్యక్తులే సంఘ క్షేమంకోసం, దేశ శ్రేయస్సుకోసం తహతహలాడతారు. జాతీయ సంస్కృతికి ప్రాణం ఉంది. కాలానుగుణంగా అది మారుతుంది. మూలతత్వం మాత్రం గుండెకాయవంటిది. అంచేత "సాంస్కృతిక దాస్యం" అనేది లేనేలేదు. ఆధునికత్వం పేరిట భావదాస్యాన్ని అలవరచుకున్నవారూ జాతీయ సంస్కృతికి దూరమైనవారూ- వాళ్ళే యివాళ మన మన జాతీయ జీవనం నైతిక విలువలను శిథిలంచేసి, కేవలం స్వప్రయోజనాలకోసం సంఘాన్ని చెద పురుగులవలె దొలిచేస్తున్నారు.

—"ఆంధ్రభూమి"

—శనివారం, 4 నవంబర్ 1972

# ఆర్థిక వ్యవస్థను మలచవలసిన తీరు

వర్ధమాన దేశాలలో ఆర్థిక వ్యవస్థను ఏవిధంగా తీర్చిదిద్దాలి ? ప్రజావసరాలను సంతృప్తి పరచడానికి అనుసరించదగిన ఆర్థిక విధానాలేమిటి ? ఇలాంటి సమస్యలను తీసుకుని ఇటీవల ఢిల్లీలో అంతర్జాతీయ ఆర్థిక వ్యవహారాల పత్రికా రచయితలు ఒక సదస్సు నడిపించి చర్చించారు. ఆరు రోజులపాటు జరిగిన గోష్ఠిలో ఆర్థిక విశ్వగోళాన్ని గిరగిరా తిప్పారుగాని- చర్చలనుండి ఎన్నెన్నో ముఖ్యాంశాలు ప్రస్ఫుటంగా బయటకు వచ్చాయి. వర్ధమాన దేశాలు, ఆర్థిక ప్రగతి, సాంఘిక న్యాయం, సాంఘిక సంక్షేమం-వాటిని ఒక గుచ్ఛంగా కలిపి చర్చించారు. ఇతరేతరాంశాలటుంచి ఒక ప్రముఖాంశాన్ని గట్టిగా నొక్కి-

చెప్పారు. సదస్సులో పాల్గొన్న మేధావులు :- ఇండియావంటి వర్ధమాన దేశాలలో, ఆర్థిక వ్యవస్థను ఎలా నడిపించాలి ? (1) నిత్య జీవనావసర వస్తువుల ఉత్పత్తి రోజురోజుకూ హెచ్చే రీతిలో పారిశ్రామిక పథకాలు రూపొందించాలి; (2) అవి సమృద్ధిగా జనసామాన్యానికి లభ్యమవడమేగాక, సామాన్యుడి ఆదాయానికీ, కొనుగోలు శక్తికీ, అందుబాటులో ఉండేవిధంగా ఖరీదులు సరసస్థాయిలో ఉండాలి. అనగా ఉత్పత్తీ, ఆదాయాలూ, ధరలూ- ఆ మూడింటికి సమన్వయాన్ని ఏర్పర్చి, అత్యధిక ప్రజలకు తోడ్పడితేగాని సాంఘిక న్యాయమూ, సాంఘిక సంక్షేమమూ, చేకూరనేరవని సదస్సులో పాల్గొన్న నిపుణులు హెచ్చరించారు అంతేగాదు, ఉపాధికల్పన అవకాశాలు క్రమంగా పెరిగేవిధంగా- ముఖ్యంగా గ్రామీణ వ్యవసాయ రంగంలో శ్రమజీవులకు- పారిశ్రామిక, వ్యవసాయిక, రంగాలను మలచాలని సూచించారు. ఆర్థిక వ్యవస్థ ఆయువుపట్లను పేర్కొన్నారు. వాటి గురించి శ్రద్ధ వహించాలన్నారు.

ఒకదేశం ఆర్థిక వ్యవస్థ సలక్షణంగా ఉందో వికృతంగా, అనారోగ్యంగా తయారై ప్రజల్ని వేధిస్తున్నదో నిర్ణయించడానికి గీటురాళ్ళు (1) ఉపాధి కల్పన అవకాశాలు (2) జీవనావసర వస్తువుల ఉత్పత్తి సమృద్ధి, లేక లోటు. (3) సామాన్య ప్రజల వేతనాలు ఆదాయాలు, వాటి కొనుగోలు శక్తి. ఈ మూడింటి మీదనే సాంఘిక న్యాయం ఆధారపడి ఉంటుంది. జాతీయ సంపద పెరిగినంత మాత్రాన పంపిణీలో న్యాయం, క్రమాభివృద్ధి, సాంఘిక న్యాయం సాధించినట్లు భావించరాదు. మూడు రంగాల విషయంలోనూ మన పాలక వర్గాలవారు మొదటినుండీ ఒక పద్ధతి అనేది లేకుండా అస్తవ్యస్తంగా వ్యవహరిస్తూ వచ్చారు. ఫలితాన్ని యివాళ దారుణంగా అనుభవిస్తున్నాము.

సాంఘిక న్యాయం, సంక్షేమం, వాటి ప్రస్తావన మొన్న రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి సైతం వేరే సందర్భంలో తీసుకువచ్చారు. ఢిల్లీలో ఒకానొక సాంఘిక సంక్షేమ సాధనా సంస్థ నూతన భవనానికి ప్రారంభోత్సవంచేస్తూ శ్రీ వి. వి. గిరి ఒక మాట అన్నారు. గడచిన సంవత్సరం దేశంలో పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి నీరసించింది. చాలా నిరుత్సాహకరంగా జరిగింది. దాన్నిబట్టి ఒక యథార్థం రూఢి అయిందన్నారు రాష్ట్రపతి. మన దేశంలో పారిశ్రామిక యజమానులుగాని, కార్మికులుగాని తమ సాంఘిక బాధ్యతలను సరిగా అర్థం చేసుకోలేదు. బాధ్యతలను విస్మరించి ప్రవర్తిస్తున్నారు. ఉభయ వర్గాలవారూ తమ నైతిక సాంఘికబాధ్యతలను గుర్తెరిగి ప్రవర్తిస్తే దేశ ఆర్థిక ప్రగతి ఎంతో ముందుకు సాగేది అన్నారు రాష్ట్రపతి. నేటి పరిణామ ఘట్టంలో జాతి మనుగడకే అధికోత్పత్తి అవసరం. ఆ విషయాన్ని పెట్టుబడిదారులూ,

కార్మికులూ, అందరూ గ్రహించి, తదనుగుణంగా కృషి చెయ్యాలన్నారు రాష్ట్రపతి.

శ్రీ గిరిగారి విమర్శ అక్షరాలా నిజం. దేశంలో మనకు యివాళ చైతన్య వంతమైన కార్మిక వర్గము లేదు. బాధ్యతాయుతమైన పెట్టుబడిదారి వర్గమూ లేదు. శ్రీ గిరిగారికి కార్మికోద్యమం గురించి ఆసాంతమూ తెలుసును. దేశంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి శ్రీ గిరిగారు జనకుడు వంటివారు. ఆయనకు కొన్ని ప్రాథమిక సూత్రాలున్నాయి ఆ విషయంలో రాజీలేదు. కార్మికోద్యమంలో రాజకీయాలకు తావులేదని శ్రీ గిరిగారు మొదటినుండీ హెచ్చరిస్తూ వచ్చారు. ట్రేడ్ యూనియన్ ఉద్యమం కేవలం కార్మికుల శ్రేయస్సు సాధనకోసమేగాని రాజకీయపార్టీల ప్రయోజనాల కోసం కాదని గిరిగారి ప్రాథమిక సూత్రం. ఐతే యివాళ కాలం మారింది. విలువలన్నీ నశించిన మునిమాపుసమయమిది. కార్మికోద్యమంలో ముఠా రాజకీయాలు ప్రవేశించాయి. కార్మిక సంక్షేమంకంటె, పదవీ రాజకీయాల సంఘర్షణలకు ప్రాముఖ్యం హెచ్చింది. అటువంటి స్థితిలో కార్మికులకుగాని, పెట్టుబడిదారీ వర్గాలకుగాని సాంఘిక దృక్పథం ఎలా అలవడుతుంది? కేవలం వర్గప్రయోజనాలకోసమే ఉభయులూ సంఘర్షిస్తూంటారు. రాష్ట్రపతి గిరిగారు కార్మికులూ, పెట్టుబడిదారులూ, రెండు వర్గాల గురించే ప్రస్తావించారు. ఆర్థిక వ్యవస్థ త్రిభుజంలో మూడోభుజం ప్రభుత్వం అనగా పాలకవర్గాలు. వాటిని గురించి రాష్ట్రపతి ప్రస్తావించలేదు.

జాతీయ ఆర్థిక రంగంలో ఉత్పత్తి నీరసిస్తున్నదన్నారు రాష్ట్రపతి. నిజమేగాని, అందుకు బాధ్యులెవరు? ఇరవై సంవత్సరాల ప్రణాళికల అనంతరం దేశ సంపద విపరీతంగా పెరిగినా, అదంతపు సంపద కొద్దిమంది చేతుల్లోకి పోయింది. పేదరికం మున్నెన్నడూ లేనంతగా విస్తరించింది. ఎటువంటి పరిశ్రమలకు మొదట ప్రాధాన్యం యిచ్చి ప్రోత్సహించాలి. "ప్రయారిటీలలో" వరుస క్రమం ఎలా ఉండాలి– అనే చింతన లేకుండా పాలకవర్గం అయోమయాన్ని అనుమతించేసరికి జీవనావసర వస్తువుల ఉత్పత్తి క్షీణించి, వాటికి దుర్భరమైన కొరత ఏర్పడి విలాస వస్తువుల ఉత్పత్తి ఆకాశందాకా పెరిగింది. ఫలితం ఆర్థిక వ్యవస్థలో సంక్షోభం. ద్రవ్యోల్బణం దేశాన్నిపట్టి పీడిస్తున్నది. జీవనావసర వస్తువుల ధరలు చంద్రమండలం చేరుకుంటున్నాయి. నిరుద్యోగ సమస్య దారుణస్థాయికి వచ్చింది. కర్తవ్యం తోచని ప్రభుత్వం సమస్యలను పరిష్కరించలేక నినాదాలతో కాలక్షేపం చేస్తున్నది. పెట్టుబడిదారీ వర్గాలకు అక్రమంగానైనా సరే అధిక లాభాలు కావాలి. సంఘటిత కార్మిక వర్గాలు

అధిక వేతనాలకోసం ఆందోళన చేస్తుంటాయి. వేతనాలు పెరుగుతాయిగాని బాధలు తీరవు. ఎంచేతంటే, రూపాయి కొనుగోలు శక్తి క్షయరోగివలె రోజు రోజుకూ క్షీణిస్తున్నది. భారీ పరిశ్రమలు ఎన్నింటిని నెలకొల్పినా నిరుద్యోగ సమస్య తీరదు. భారీ పరిశ్రమలకు విపరీతమైన పెట్టుబడికావాలి. నిష్పత్తిలో ఎక్కువ మందికి ఉపాధికల్పించనేరవు. వాటితో చిక్కు అదే. పెట్టుబడి అంతులేకుండా కావాలనేసరికి, ప్రభుత్వాలు లోటు బడ్జెట్టు విధానాన్ని అనుసరిస్తాయి. మళ్ళీ ద్రవ్యోల్బణం విజృంభణ. ఈ విషమచక్రాన్ని ఛేదించేవారెవరు ?

జాతీయార్థిక వ్యవస్థ ఎవరికీ అంతుచిక్కని పద్మవ్యూహంవలె తయారైంది. జీవనావసర వస్తువుల ఉత్పత్తి ఉధృతి హెచ్చించి, ధరలను కఠోరంగా శాసించి, ఆదాయాలకూ, వేతనాలకూ, ధరలకూ, ఒక సమన్వయం సాధిస్తేగాని ఆర్థిక ప్రగతి అసాధ్యం. నిరుద్యోగ సమస్యను పరిష్కరించడం అంతకంటె అసాధ్యం. ఉపాధికల్పనా, దానితోపాటు జీవనావసర వస్తువుల ఇతోధికోత్పత్తి, రెండింటినీ సాధించే విధంగా పారిశ్రామిక రంగం "ప్రయారిటీ"లను ఆద్యంతం సవరించాలి.

—''ఆంధ్రభూమి"

—మంగళవారం. 12 డిసెంబర్ 1978

## ప్రాథమిక సమస్యపట్ల రాష్ట్రపతి శ్రద్ధ

జంట నగరాలలో రేషనింగ్ విధానంపట్ల రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి చూపుతున్న ప్రత్యేక శ్రద్ధ కొంతవరకు సత్ఫలితాలను ఇస్తున్నదనే భావించాలి- మొన్న మంగళవారంనాడు రాష్ట్రపతి నిలయంలో జంటనగరాల రేషన్ చెకింగ్ ఇన్‌స్పెక్టర్ల సమావేశంలో మాట్లాడుతూ శ్రీ గిరిగారు నిర్మొహమాటంగా కొన్ని యధార్థాలు వాళ్ళకు గట్టిగా చెప్పారు. ఆహార ధాన్యాల సరఫరాకు సంబంధించిన పాలనా యంత్రాంగం అవినీతికి ఆలవాలమని దేశమంతటా ఖ్యాతివహించిందని స్పష్టంగా చెప్పారు. ఆ సదస్సులో గవర్నర్ సలహాదారు శ్రీ వి.కె. రావుగారు, సివిల్ సప్లయ్ శాఖ ఉన్నతాధికారులు అందరూ ఉన్నారు. ఎవరి మనస్సూ నొప్పించడం రాష్ట్రపతి ఉద్దేశం కాదు. ఐనప్పటికీ నిజాన్ని తెలియజెప్పి మృదువుగా హెచ్చరించవలసిన అగత్యం ఏర్పడింది. మౌనంగా, నిస్సహాయంగా బాధపడుతున్న సామాన్య ప్రజల స్థితిగతులు శ్రీ గిరిగారికి సాక

ల్యంగా తెలుసును. ఆయన చెప్పినదాంట్లో లవలేశం అతిశయోక్తి లేదు. పాలనా యంత్రాంగం అవినీతి భరితమైనది గనుకనే మొత్తం ఆహార ధాన్యాల సరఫరా కార్యక్రమాన్ని ప్రభుత్వం పూర్తిగా స్వాధీనం చేసుకోబోయే దినాన్ని తలచుకొని ప్రజలు ఇప్పటినుండి హడలిపోతున్నారు. అది విషయాంతరం. సివిల్ సరఫరాల సిబ్బంది నీతి, నిజాయితీలతోను, సమాజంపట్ల బాధ్యతతోనూ తమ విధులు నిర్వర్తించాలని రాష్ట్రపతి హితబోధ చేశారు. ఆఫీసర్లూ, సిబ్బందీ దీక్షతో కృషి చేస్తే, సామాన్యుడి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొంటే అవి నీతికి ఆస్కారం ఉండదన్నారు. అదే సందర్భంలో మరొక విషయం నొక్కి పలికారు. అక్రమ నిల్వదారుల్ని, బ్లాక్‌మార్కెట్ వర్తకుల్నీ కఠినంగా శిక్షించి తీరాలన్నారు. వాళ్ళు సంఘానికి శత్రువులు గనుక వాళ్ళను ఆ విధంగా పరిగణించి సత్కరించాలన్నారు.

ఈసారి హైదరాబాద్‌లో విడిదిచేసిన సమయంలో రాష్ట్రపతి ప్రజల ఆహార సమస్యపట్ల ఎనలేని శ్రద్ధ తీసుకొని వివరాలను స్వయంగా తనిఖీ చేయడం గమనించదగినది. సంఘంలోని అత్యున్నతులు ఏర్పాటుచేసే కార్యక్రమాలలో పాల్గొనడంతో సంతృప్తిపడక ఆహార సమస్యను స్వయంగా పరిశీలిస్తున్నారు. లాంఛనప్రాయమైన కార్యక్రమాలు కేవలం సంఘంలోని చిటారు కొమ్మ వారికి మాత్రమే ఉల్లాసాన్ని ఇస్తాయి. శ్రీ గిరిగారు ప్రవృత్తివల్ల ప్రజల మనిషి. శ్రీమతుడుగా జన్మించినా తన రాజకీయ జీవితాన్ని యావత్తూ అర్భక వర్గాల ఉన్నతికోసమే ధారపోసి వారితో కలసి మెలసి చిరకాలం కృషి చేశారు. ఆయన ఆకాశ వీధులలో విహరించే శుష్క ఆదర్శవాది కాదు. ఆయనది వాస్తవిక జీవనానికి సంబంధించిన ఆదర్శవాదం. ఆయనకు కార్యవాదంలోనే ఎక్కువ విశ్వాసం ఉంది. బ్రహ్మాండమైన సామ్యవాద విధానాలనూ, పాలసీలనూ ఎంత పసందుగా రూపొందించినా వాటిని కార్యక్షేత్రంలో అమలు జరపవలసిన ప్రభుత్వ సిబ్బంది అవినీతికి లోబడితే వాటివల్ల ప్రయోజనం శూన్యం. నేలబారుగా వాటిగురించి ఆలోచించి నిర్విరామంగా కృషిచేసే ప్రయత్నాలు జరగాలి. ఇంతకూ సామ్యవాదం అంటే సామాన్యుడికి అర్థమయ్యేదేమిటి ? స్వానుభవంలోకి రానంతవరకూ అది ఎలాంటిదైనా అతనికి అక్కరలేదు. మనిషికి ప్రాథమికావసరం తిండి రాజకీయ పరిణామాలను చిందరవందర చేసే శక్తి ఆహార సమస్యకు ఉంది. సజీవమైన జాతి, పటిష్ఠంగా రూపొందాలనుకొనే జాతి ఓం ప్రథమం అహార సమస్యను పూర్తిగా పరిష్కరించుకొని ఆ తర్వాత తక్కిన సమస్యలతో కుస్తీ పడుతుంది. అవినీతి భూయిష్టమైన యంత్రాంగం యెంత గొప్ప ప్రగతి విధానమైనా భగ్నం చేయగలదు. అలాంటి ప్రమాదాన్ని నివారించాలంటే మొట్టమొదట ఆహార రంగంలో అవి

నీతిని నిర్మూలించాలి. పూర్తిగా నిర్మూలించడం ఎన్నటికీ సాధ్యం కాకపోవచ్చును. ఐతే ప్రజలు సహించి భరించగలిగే అవకాశం ఉండాలి. సమాజంలోని నిస్సహాయుని అవినీతి వ్యాఘ్రాలు కబళించకుండా రక్షించగలిగే ప్రభుత్వమే నిజమైన ప్రభుత్వమనిపించుకుంటుంది. సామాన్యుడి అభిమానాన్ని సంపాదించడానికి అతడి క్షుద్బాధ తీర్చడం ఒక్కటే మార్గం. నేటి అభ్యుదయ నాయకులందరూ ఈ మౌలిక సత్యాన్ని విస్మరించి నేలవిడిచి సాముచేస్తూ ప్రజల్ని మరింత చీకాకు పరుస్తున్నారు. అందుకనే రాష్ట్రపతి ఘనతర విషయాల జోలికి పోకుండా దినదినావసరమైన తిండి సమస్య తీసుకొని ఆ మేరకు పాలనాయంత్రాంగాన్ని ప్రక్షాళితం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇక్కడ ఉన్నన్నాళ్లూ రాష్ట్రపతి నిండైన ప్రజాభిమానాన్ని పురస్కరించుకొని యథాశక్తి కృషి చేస్తున్నారు. ఆవరించిన చీకటిని వీలైనంతవరకు పారద్రోలడానికి తన శక్తిలో ఉన్నంతవరకూ జ్యోతులు వెలిగిస్తున్నారు. సివిల్ సరఫరా శాఖలో కొంతవరకూ సంచలనం వచ్చినట్లు తోస్తున్నది. రాష్ట్రపతి వెలిగించిన చిన్న దీపాలు ఆయన ఢిల్లీ వెళ్ళిన తర్వాత కూడా అధికారులు అలాగే ఉంచుతారో, ఆర్పేస్తారో అనేది మున్ముందు తెలియాలి. ఏమైనప్పటికీ రాష్ట్రపతి చేస్తున్న అనన్య కృషికి జంట నగరాల పౌరులు మౌనంగా కృతజ్ఞత లర్పిస్తారు.

—"ఆంధ్రభూమి"

—గురువారం, 20 సెప్టెంబర్ 1973

## పెక్కు యుగాల కనుమూత

"నానృషిఃకురుతేకావ్యమ్" అన్న అభియుక్తోక్తి కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ యెడల అక్షరాలా అన్వయిస్తుంది. ఆయనొక కవితాఋషి; రచనాయోగి. ఋషికి, యోగికి ఉండే లక్షణాలన్నీ సంపూర్ణంగా ఆయనలో ఉన్నాయి. క్రాంత దర్శిత, విశ్వజనీనత, లోకకల్యాణ కాంక్షిత, సాధినిదిధ్యాసనం- ఆయనలో, ఆయన రచనలలో వేయి పడగలతో విప్పారి ఉంటాయి. మనిషిగా పెరగనిదే రచనా పెరగదనడం సహృదయ హృదయైక వేద్యం విశ్వనాథ యోగి, ఋషితుల్యుడన్నప్పుడు మనిషిగా పెరిగాడనడం చర్విత చర్వణమే అవుతుంది. ఆయన వైయక్తిక జీవితంలోను, సారస్వత జీవితంలోను ప్రాచీన సంప్రదాయానుసారే అయినా, ఆ అనుసరణ ఆయన నిండు

హృదయానికి, మానవతకు ఎన్నడూ అడ్డు రాలేదు. కులమత విభేదాలు కాల రాచి సాయపడిన ఘట్టాలు కోకొల్లలు.

ప్రాచీన సంప్రదాయం అప్పుడు ఒక సంగతి పరిశీలనార్హం: నిజానికి పాత కొత్తలు ఒక నాణెం రెండు పార్శ్వాలే. ఒకొక సందర్భంలో ఏది పాతో ఏది కొత్తో విడగడించడం పట్టు కత్తరించినట్టుగా గిరిగీయడం సాధ్యం కాదన్నది చారిత్రక సత్యం. పాత కొత్త వేషంతో ముందుకురావడం, కొత్త పాత ముసుగుతో మరుగున పడటం చరిత్ర గతి. దీనిలో విచిత్రంగా పాత కొత్తల మేళవింపు జరిగినా, రెండింటి వ్యక్తిత్వమూ కానరావడమూ కద్దు.

విశ్వనాథ వ్రాతను పట్టుకొని ప్రాకులాడారనడం పలువురిమాట. కొత్త వింత పాతరోత అన్నది సామాన్య ప్రజల స్వభావం కాని, స్థితి ప్రజ్ఞుడైన విశ్వనాథ వ్రాత విశ్వ కల్యాణ సంధాయకమని నమ్మినవాడు కనుక, దానిని ఉభయ జీవితాలలోను వదలలేదు. ఆ వదలక పోవడం, ఆయన నొక విశిష్ట వ్యక్తిగా అపార సాహిత్యంపారావార స్రష్టగా తీర్చిందనిపిస్తుంది. పాండురంగ సుకవి అందరి ఒడుపులతో పద్యం చెప్పనేర్తునన్నాడు. చెప్పాడో లేడో కాని, నన్నయ భట్టారకుని ప్రసన్న కథాకలితార్థ యుక్తి, తిక్కనార్యుని నుడికారం, శ్రీనాథుని పదగుంభన, అల్లసాని అల్లిక జిగిబిగి. కృష్ణరాయల కాఠిన్యం-ఇవన్నీ విశ్వనాథరచనలో విశ్వరూపంతో సాక్షాత్కరిస్తాయి; సాక్షాత్కరించి విశ్వనాథ రీతిగాఏకరూపంగా చెందాయి.కాటూరి వేంకటేశ్వరరావు "నేనొక్కటి మనలోమాట వచింతు సూరనయో సోమన్నో, మరే పెద్దనోయని చెప్పం బనియేమి నీవగుదు నీకేసాటి మమ్మాటికిన్" అన్నట్టు ఆయనకు ఆయనే సాటి. "పాషాణ పాక ప్రభూ!" అని వెక్కిరించినవారూ ఉన్నారు. కానీ, ఆయన వెక్కిరింపులకు కొక్కిరింపులకు చిక్కి వెనక్కు తగ్గినవాడు కాదు. తా ననుకొన్న అభ్యుదయ మార్గంలో నల్లేరుపై బండిగా నడిచాడు.

అభ్యుదయం- అన్న మాట విషయంలోను ఆయన నిర్వచనం వేరు. కొందరు రాజకీయవాదులు కూడబలుక్కుని ప్రచారం చేసేదే అభ్యుదయమా? ఎందుకు కావాలి? మన పూర్వులు ఆశించిన, ఆలపించిన అభ్యుదయం వేరని, సర్వజనీనమని ఆయన విశ్వాసం. బీభత్స ప్రక్రియలతో సాధించే అభ్యుదయం నిజానికి అభ్యుదయం కాదని, సార్వత్రికానంద సంధాయకమే అభ్యుదయమని నమ్మేవారిలో ఆయన ఒకరు. కనుక ఆయన తన సాహిత్య ప్రక్రియ లన్నిటి లోను ఈ రసానందాభ్యుదయమే తొణికిసలాడుతుంది. "స్వస్తి ప్రజాభ్యః"

అన్నది ఆయన రచనా యోగానికి కుండలిని, కనుకనే ఆయన వైయక్తిక సారస్వత భావాలు ఎంత విడ్డూరంగా వున్నా, వికటంగా కనిపించినా, రసనిష్యందులు కావడం వల్ల సహజంగా సహృదయులను ఆకట్టుకొంటున్నాయి; ఆయన యశశ్చంద్రికలను విస్తరింపజేస్తున్నాయి. సహృదయ హృదయావర్జనకు మరొక కారణమూ ఉంది. అది ఆయన పాత్రలు. విశ్వనాథ భవిష్యత్తులో చూపుపెట్టి భూతంలోకి అడుగు వేస్తాడని ఎంత విమర్శ ఉన్నా ఆయన పాత్రలు కొంత వేషం మార్చుకొని లోకంలో తిరిగే వర్తమానపులే. అందువల్లనే ఆయన చారిత్రక నవలలు కూడా జనరంజక మయ్యాయి. పెక్కు నవలలలో, కావ్యాలలో, చివరకు రామాయణంలోను సమకాలికోద్యమాల ప్రభావం పడకపోలేదు. సమకాలిక ప్రతిభా ప్రజ్వలనానికి గత వైభవ పునశ్చరణ తప్పదన్నది చరిత్ర సత్యం. ఏ దేశాభ్యుత్థాన చరిత్ర చూచినా ఇది నిత్యం. గత వైభవ ప్రశస్తి కొందరికి వెర్రిగా, ఆవేశంగా కనిపించవచ్చు. ఆ శివమెత్తిన ఆవేశం లేనిదే కార్యోత్సాహం జనించదు. విశ్వనాథ పెక్కు రచనలు ప్రజోద్యమాలలో ఈ ఉత్సాహ ప్రవాహాలను పారించాయి.

ఆయన కావ్యా ప్రవర్తనను పరికించినవారు ఆయనను అహంకారిగా భావించారు. అహంకారానికీ, ఆత్మాభిమానానికి వ్యత్యాసం తెలియనివారి భావన ఇది. అహంకారం ఆత్మ విధ్వంసన చణం. ఆత్మాభిమానం ఆత్మోన్నత్య సంధాయకం. దాదాపు రెండు లక్షల పుటలు వ్రాసిన రచయిత, కవిసామ్రాట్, కళాప్రపూర్ణ, పద్మభూషణాద్యనేక బిరుద విరాజితుడు, ఆస్థానకవి, తాను నమ్మినదానిని తన్మయతతో ఆరాధించేవాడు, ఏ ప్రలోభానికీ అధికారానికీ తల ఒగ్గనివాడు, అనేకానేక సాహిత్యాలను పుక్కిట బట్టినవాడు ఏ ధోరణిలో మాట్లాడుతాడు ? వ్యాసునివలె, వాల్మీకివలె, షేక్‌స్పియర్‌వలె, ఆనందవర్ధనునివలె, అభినవ గుప్తునివలె, క్షేమేంద్రునివలె మాట్లాడడా ? తెలుగు రచయితను కాదు యావత్ప్రపంచ రచయితలను తల ఎత్తుకొనేట్టు చేసే ఆత్మగౌరవ పరాకాష్ఠ విశ్వనాథ. దీనితోనే ఆయన తన రామాయణాన్ని "అమరీ కైశిక పారిజాత కుసుమోత్కాస్వాదువు" అని చెప్పుకొన్నాడు.

విశ్వనాథ పదునాలుగవయేటే కవిగా అవతరించాడు. మహా కవిగా, మహా రచయితగా మనినాడు. సాహిత్య జగత్తులో సకల ప్రక్రియలలోనూ అంచులు చూచాడు. కొన ఊపిరివరకు కవితా గోష్ఠులతో ఆనందించి మొన్న సోమవారం శాశ్వతంగా కన్ను మూశారు. ఆ కన్ను మూతతో, పెక్కు యుగాలు కన్ను మూశాయనవచ్చు.

"బాణోచ్ఛిష్టమిదంజగత్" అనేది సంస్కృతా భాణకం. తర్వాత సంస్కృత కవులు బాణుని అనుసరించడంవల్ల ఇది యేర్పడింది. తెలుగు సాహిత్యంలో నేటి పెక్కు ప్రక్రియలు విశ్వనాథానుసరణలు. కనుక 'విశ్వ నాథోచ్ఛిష్ట మిదం జగత్"అని ఘంటాపథంగా చెప్పవచ్చు,

—"ఆంధ్రభూమి"
—బుధవారం, అక్టోబర్ 20 1976






సాహితీవాహినిలో
ఇంతవరకు వెలువడిన
తరంగాలు

| | | |
|---|---|---|
| 1. | మందారమకరందాలు | రు. 2-00 |
| 2. | వేమన్న వేదం | ,, |
| 3. | భోగినీలాస్యం | ,, |
| 4. | వడగళ్ళు | ,, |
| 5. | నా గొడవ | ,, |
| 6. | శ్రీనాథుని కవితావైభవం | ,, |
| 7. | విశ్వనాథ కవితావైభవం | ,, |
| 8. | సిందూరం | ,, |
| 9. | శిఖరాలు-లోయలు | ,, |
| 10. | భావన | ,, |
| 11. | మెరుపులు | ,, |
| 12. | తిక్కన కవితావైభవం | ,, |
| 13. | చలం ఆలోచనలు | ,, |
| 14. | భారతీ వైభవం | ,, |
| 15. | తిమ్మన కవితావైభవం | ,, |
| 16. | ధూర్జటి కవితావైభవం | ,, |
| 17. | తులసీదాసు కవితావైభవం | ,, |
| 18. | నన్నయ కవితావైభవం | ,, |

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

Cover Printed at New Vistas Printers, Hyd-27.